మన తెలుగు తెలుసుకుందాం

-డాక్టర్ ద్వా.నా.శాస్త్రి

ప్రతులు : 1000

ప్రచురణ : మే, 1997

వెల : రూ.50-00



సోల్ డిస్ట్రిబ్యూటర్స్ :

విశాలాంధ్ర బుక్ హౌస్, బ్యాంకు వీధి, హైదరాబాదు.

రచయిత చిరునామా

డాక్టర్ ద్వా. నా. శాస్త్రి
చల్లావారి వీధి
అమలాపురం - 533 201 (తూ.గో.జిల్లా)
ఫోన్ : (08856) 21492

ముఖచిత్రం : శ్యాంమోహన్




Typesetting:
VARAVARNINI, 101, Doyens Township, HYDERABAD 500 019.
Phone: 3010670

Printed by:
G.S.Raju, Lepakshi Graphics, 12-10-416/4/A, Seethaphalmandi,
Secunderabad. Phone: 7612719 / 7642188

మద్రాసులో నివసిస్తున్నా
తెలుగు భాషా సాహిత్య సంస్కృతీ వికాసాలకు
ఎంతో సహకరిస్తున్న
**మంచి మనీషి...**
**స్వధర్మ స్వారాజ్య సంఘ సారథి**



**శ్రీ బి. వి. ఎస్. ఎస్. మణి గార్కి**

ఈ పుస్తకం
వెలువడటానికి ముఖ్యకారకులు ......

శ్రీ డి. వి. రమణరావు, సి.ఎ.
ఏలూరు.

శ్రీ చక్కా సూర్యనారాయణ
మేనేజింగ్ పార్ట్‌నర్
శ్రీరామా థియేటర్, తుని.
శాంతి-ప్రశాంతి థియేటర్స్, విజయవాడ.

శ్రీ కె.వి.రత్నం
డైరెక్టర్, రత్నం ఎడ్యుకేషనల్ సెంటర్, నెల్లూరు.

శ్రీ పోతుల వీరభద్రరావు
మాజీ శాసనసభ్యులు,
టౌన్ హాల్ అధ్యక్షులు, రాజమండ్రి.

శ్రీ చదలవాడ నాగేశ్వరరావు
పిన్నమనేని పోలి క్లినిక్
సిద్దార్థ నగర్, విజయవాడ.

శ్రీ డి.వి. ప్రభాకర శర్మ, బి.ఇ.
హైదరాబాదు.

శ్రీ గమిని రాజా
తణుకు.

...... వీళ్ళకి ప్రత్యేక కృతజ్ఞతలు.

## పుస్తకం గురించి నాలుగు ముక్కలు .....

శ్రీ నండూరి రామమోహనరావు సంపాదకులుగా ఉన్నప్పుడు కీ.శే. త్రిపురనేని శ్రీనివాస్ అదివారం ఆంధ్రజ్యోతిలో 'ఇదీ మన తెలుగు' అనే శీర్షిక నాచేత రాయించాడు. చాలామంది ఆ శీర్షికను మెచ్చుకున్నారు. 'భాషా శాస్త్రాన్ని సింపుల్‌గా చెప్తున్నావే!' అన్నారు.

అయితే ఇందులోని అంశాలు భాషా. సాహిత్యం చదువుకొన్నవాళ్ళకి తెలిసివుంటాయి. ఎన్నో పుస్తకాలు. వ్యాసాలు దినపత్రికలు చదివి తెలుసుకొన్నవీ పెద్దలు చెప్పినవీ. నాకు తెలిసినవీ మామూలు భాషలో - అందరికీ అర్థమయ్యే విధంగా చెప్పాలనిపించింది. టెక్నికల్‌గా. సీరియస్‌గా - గ్రామర్ క్లాస్‌లా కాకుండా "పాపులర్" చెయ్యాలని ప్రయత్నించాను. 'ఇందులో పొరపాట్లు ఉండవు' అనే అహంకారం నాకు లేదు సవరణలు తెలిపితే సంతోషిస్తాను.

........ ద్వా నా

పరిమి రామనరసింహం
రీడర్, తెలుగు శాఖ
యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాద్
హైదరాబాదు 500 046.

# మిత్ర వాక్యం

పేరు పొట్టి చేసుకొని ప్రతిష్ఠను పొడుగు చేసుకున్న మా ద్వా నా శాస్త్రి ఈ పుస్తకంతో తెలుగును గురించిన సమాచారాన్ని ప్రజలకు చాలా దగ్గరికి తీసుకుపోయాడు. ప్రతి మనిషికీ తల్లి ఎట్లా ఎక్కువ పరిచయం గలదీ, ఆత్మీయమైనదీ అయిన వ్యక్తో, భాష అనేది కూడా అంత ఎక్కువ పరిచయం గలదీ ఆత్మీయమైనదీ అయిన వస్తువు(?). అతి పరిచయాత్ అవజ్ఞా అన్నట్లుగా, తల్లి మనకు ఎన్ని రకాలుగా ఊడిగాలు చేసిందో. చేస్తుందో మనం గుర్తించనట్లుగానే మన భాష మనకు ఎట్లా ఉపకరిస్తున్నదో గుర్తించం. అది తెలుసుకోటానికే తెలుగు భాషా సాహిత్యాలు చదువుకోని వాళ్ళంతా ఈ పుస్తకాన్ని చదవాలి. ఇట్లా వేరు చేసి ఎందుకు చెప్తున్నానంటే ''ఇందులోని అంశాలు భాషా, సాహిత్యం చదువుకొన్నవాళ్ళకి తెలిసి ఉంటాయి'' అని రచయిత భావిస్తున్నాడు కనక. అయితే భాషా సాహిత్యాలు చదువుకున్నవాళ్లు కూడా ఈ పుస్తకం చదవాలి. ఎందుకంటే, భాషను గురించి ''గ్రామర్ క్లాసులా కాకుండా'' గ్లామర్ క్లాసులా చెప్పటంలో ద్వానా ఎట్లా సక్సెస్ అయినాడో తెలుసుకోటానికి. వాక్యాల్లో ఎన్ని రకాలున్నాయో చెప్పాడు; మనం మామూలుగా ఆడుకునే మాటల్లో కూడా అలంకారాలు ఎట్లా ఉంటాయో చెప్పాడు; సామెతలను గురించి చెప్పాడు. తప్పొప్పులను గురించి చెప్పాడు; ఇంకా ఎన్నెన్నో చెప్పాడు; బాగా చెప్పాడు; తేలికగా చెప్పాడు; విషయం పాపులర్ అయ్యేలా చెప్పాడు; పరిశోధకులారా! మీరు కూడా 'పాపులరు' కాదలచుకుంటే ఇట్లా చెప్పటం నేర్చుకోండి అని ఛాలెంజ్ చేస్తున్నట్లుగా చెప్పాడు. ఆ చెప్పినవాటిలో శాస్త్రబద్ధత కలవీ ఉన్నై, ఊహ మీద ఆధారపడి చెప్పినవీ కొన్ని ఉన్నై. అయితే పరిశోధక విద్యార్థులు మాత్రం

ఈ గ్రంథంలోనించి ఏదైనా సమాచారాన్ని గ్రహించేటప్పుడు శాస్త్రి మాయలో పడకుండా అతను పుస్తకం చివర ప్రస్తావించిన గ్రంథాలను కూడా చూసి ఆయా విషయాల లోతులకు వెళ్ళి ఆకళింపు చేసుకొని ముందుకు పోవటం అవసరం. పైగా దీన్ని వాళ్లకోసమని టెక్నికల్‌గానూ (అంటే రిఫరెన్సులూ అవీ ఇస్తూ) సీరియస్‌గానూ రాయలేదని అతనే కుండ బద్దలుకొట్టినట్లు చెప్తున్నాడు కదా! ఈ సీరియస్‌నెస్ లేకపోవటం వల్ల పెద్దగా ముంచుకుపోయిందేమీ లేదు కాని, ఒకటి రెండు చోట్ల కాస్త సరాకున పడ్డాడనిపిస్తుంది. ఉదాహరణకు, తెలుగులో అక్షరాలెన్నో చెప్తూ బాలవ్యాకరణం 36 అక్షరాలని ప్రౌఢవ్యాకరణం 55 అక్షరాలని - రెండూ రెండు రకాలుగా చెప్పాయని ఆక్షేపించాడు శాస్త్రి (పుట 6) కాని బాలవ్యాకరణం ఆ తర్వాతి సూత్రంలోనే ఋ ౠ ఌ ౡ విసర్గ ఖ ఛ ఠ థ ఫ ఘ ఝ ఢ ధ భ ఙ ఞ శ షలు అని మరో 19 'వర్ణాలను' కూడా చెప్పింది. అంటే మొత్తం 55 ఐనట్లేగా! పైగా అవి సంస్కృత పదాలలో మాత్రమే వస్తాయని చెప్పింది. అంటే ఈ 19 వర్ణాలలో ఏవి ఉన్నా అవి కచ్చితంగా సంస్కృత పదాలేనని గుర్తించే కిటుకు చూపించిందన్నమాట! అందరికీ అర్థంకావాలని అందరూ మామూలుగా వాడే 'అక్షరాలు' అన్నాడు కాని, వాటిని 'వర్ణాలు' అనాలనీ వ్యాకరణాలు అట్లాగే అన్నాయనీ వర్ణాలు వేరు అక్షరాలు వేరు అనీ శాస్త్రికి తెలియని సంగతి కాదు.

ద్వానాశాస్త్రీ నేనూ ఆంధ్రా యూనివర్సిటీలో ఒకే బెంచీ మీద కాకపోయినా ఒకే తరగతిగదిలో కూర్చొని గురువర్యులు దొణప్పగారి తెలుగు భాషాశాస్త్ర పాఠాలు విన్నాం, నేర్చుకున్నాం. నాకంటె ఒక వరస ముందు కూర్చొని విన్న శాస్త్రికి నాకంటె కొంచెం ఎక్కువగానే ఆ పాఠాలు ఒంటబట్టినై. ఆ లోటు పూరించుకోటానికి నేను అన్నామలై యూనివర్సిటీకి వెళ్లి భాషాశాస్త్రంలో కూడా ఎమ్.ఏ. చదివి-రావాల్సొచ్చింది. ఆ కలిసి చదువుకున్న అర్హతతోనే రాశా ఈ మిత్రవాక్యం.

పరిమి రామనరసింహం

## కృతజ్ఞతలు....

కీ.శే. ఆచార్య తూమాటి దొణప్ప

ఆచార్య చేకూరి రామారావు

ఆచార్య ఎన్. గోపి

ఆచార్య రవ్వా శ్రీహరి

శ్రీ నందూరి రామమోహనరావు

కీ.శే. త్రిపురనేని శ్రీనివాస్

శ్రీ వల్లూరి రాఘవరావు

శ్రీ దాట్ల నారాయణమూర్తిరాజు

డాక్టర్ వి. చక్రపాణిరావు

డాక్టర్ బి. వి. రమణమూర్తి (మార్గశీర్ష)

శ్రీ ఫణికుమార్, ఐ.ఎ.ఎస్.

డాక్టర్ పరిమి రామనరసింహం

చిరంజీవి జి. ఎస్. రాజు

చిరంజీవి దార్ల వెంకటేశ్వరరావు

చిరంజీవి పమ్మి పవనకుమార్

చిరంజీవి శ్యాంమోహన్

శ్రీ పి. రాజేశ్వరరావు (విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్)

శ్రీ పేదగిరి రాంబాబు

గార్లకు......

అదెవో తెలుగుతల్లి
అందాల నిండు జాబిల్లి
ఆనందాల కల్పవల్లి
అదె నీ తెలుగు తల్లి
పదవోయ్ తెలుగువాడా
అదె నీ తెలుగు మేడ
సంకెళ్ళు లేని నేల
సంతోష చంద్రశాల

-- శ్రీశ్రీ

******

"స్వాభిమానం సభ్యలక్షణం
దురభిమానం ధూర్తలక్షణం
నిరభిమానం నిర్వీర్యలక్షణం"

-- సినారె

******

# మన తెలుగు తెలుసుకుందాం

## ముందుగా భాష గురించి కొంత..........

మానవుడికీ పశువుకీ గల ముఖ్యమైన తేడాల్లో భాష ఒకటి. ఒక జాతి లేదా దేశం సంస్కృతి గానీ, చరిత్ర గానీ కళలు గానీ, సాహిత్యం గానీ అన్నీ భాష మీదే ఆధారపడి వుంటాయి. అసలు భాష ప్రజలది. ప్రజలకోసమే పుట్టింది. అభిప్రాయాల్ని వ్యక్తపరిచే ఒక సాధనం భాష. ఆ తర్వాతే సాహిత్య భాష, శాస్త్రభాష మొదలైనవి పుట్టాయి. 'భాష' కి తెలుగులో సరైన పదం లేదు. ఉండాలనీ లేదు. కొన్నిటికి కొన్ని భాషల్లో మాటలు లేక పోవటం సహజమే. భాష అంటే ఏమిటి? ఉచ్చారణ అవయవాల సహాయంతో భావాన్ని తెలియజేసే మాటల సమూహమే భాష అన్నారు. అభిప్రాయల్ని వివరించే ధ్వనుల ఉచ్చారణని భాషగా కొందరన్నారు. అయితే ఉచ్చారణ లేకుండానే అవయవాల కదలిక ద్వారా కూడా అభిప్రాయాల్ని తెలియచెప్పవచ్చు. వెళ్ళు, రా, వద్దు, నిశ్శబ్దం వంటివాటిని అవయవాల సంకేతం ద్వారా తెలపటం మనకి తెలిసిందే గదా!

ఇంతకీ భాష ఎలా పుట్టింది? ఈ ప్రశ్న ప్రశ్న గానే మిగిలిపోతుంది 'భాష దేవుడి సృష్టి' అంటే అసలు చిక్కేమీ వుండదు. కాని, పుట్టిన పసిబిడ్డని అడవిలో వదిలేసి వచ్చేస్తే - భాష రాదని నిర్ణయించారు.

అందువల్ల మానవ సమూహంలో వుంటేనే భాష అలవడుతుందన్నమాట! సంస్కృత భాషను ''అమరుల భాష''గా చెప్తారు. భాష ఎలా పుట్టింది అనే దానికి చాలా సిద్ధాంతాలున్నాయి. అయితే సమగ్రమైన, సహేతుకమైన, సార్వకాలికమైన, సార్వజనీనమైన సిద్ధాంతం లేదనాలి.

ప్రపంచంలో ఇప్పుడు సుమారుగా 2,900 భాషలు ఉన్నాయని చెప్తారు. మన దేశంలోనే రెండు వందల భాషలున్నాయట! తెలుగు మొదలైన భాషలన్నీ సంస్కృతంలో నించే పుట్టాయని నమ్మేవారు. కాని అది సరి కాదని భాషాశాస్త్రం నిరూపించింది. సంస్కృత భాషా ప్రభావం ఉన్న మాట నిజమే కాని - ''అన్ని భాషలకి తల్లి సంస్కృతం'' అన్నది సహేతుకం కాదని తేలింది. ఉత్తర భారత దేశంలోని భాషల్ని ఆర్య భాషలని అంటారు. తెలుగు, తమిళం, మలయాళం, కన్నడం మొదలైన వాటిని ద్రావిడ భాషలంటారు. తెలుగు ద్రావిడ భాష అన్నమాట!

భాషలో మధురభాషలు, చేదుభాషలు, కారం భాషలు అనేవి ఉండవు. ఏ భాషాసౌందర్యం దానికి వుంటుంది. మనం మన భాషని తేట తెలుగు, కమ్మని భాష అన్నట్టు గానే ఇతరులు కూడా వాళ్ళ భాషల్ని అలాగే భావిస్తారు. నిజానికి ఈ భావనలు సరికావు.

ఎవరి భాష వాళ్ళకి తియ్యగా, కమ్మగా వుంటుంది. అన్ని భాషలూ వచ్చినవాళ్ళకి ఇటువంటి అభిప్రాయాలుండవు. భాష బాగుండటం, బాగుండకపోవటం అనేది 'అలవాటు'ను బట్టి, అభ్యాసాన్ని బట్టి, 'అభిరుచి' ని బట్టి మాత్రమే వుంటుంది. అది భాషా లక్షణం కాదన్న మాట! ఇటువంటి అభిప్రాయాలు భాషాభిమానం ఏర్పడటానికి తోడ్పడతాయి. భాషాభిమానం మంచిదే కాని - భాషాదురభిమానం ప్రమాదకరమైంది. మరొక భాషని హేళన చెయ్యటంగానీ, మరొభాషపై 'ఎలర్జీ' గానీ ఎంత మాత్రమూ మంచిది కాదు. దానివల్ల భాషమాట్లాడే వారిపై ద్వేషభావం ఏర్పడుతుంది. అన్ని భాషలూ మంచివే! అన్ని భాషల్లోనూ తియ్యదనం, కమ్మదనం వుంటాయి. అందుకనే 'సరస్వతి'ని సకల భాషామతల్లిగా పిలుస్తారు. కాబట్టి అన్ని భాషల్ని ఆదరించాలి. భాషా సమైక్యత ద్వారా 'సెక్యులరిజం' సాధించవచ్చు.

ఇక మన భాషని గురించి సంగ్రహంగా తెలుసుకుందాం!

## తెలుగు భాషకి ఎన్ని పేర్లున్నాయి? అవి ఎలా వచ్చాయి?

మన తెలుగు భాషకి చాలాపేర్లుండేవి. పోర్చుగీసువాళ్ళు మన భాషని 'జెంటూ భాష' అని పిలిచేవారు. తమిళ, కన్నడ పుస్తకాల్లోనూ, శాసనాల్లోనూ 'వడుగ, వడగ, తెలింగ, తెలుంగు' అనే విధంగా పేర్లు కనిపిస్తాయి. విదేశీయులు కొందరు 'తెలూగు' అనే వారు. అయితే ఎక్కువగా వాడే పేర్లు మూడు - అవి ఆంధ్ర, తెలుగు, తెనుగు అనేవి.

ఋగ్వేదంలోనే 'ఆంధ్ర' పదం వుంది కాబట్టి ఆంధ్ర జాతి అప్పటికే (అంటే సుమారు క్రీ.పూ. 600సం) వుందని తెలుస్తుంది. 'ఆంధ్ర' అనే పదం వీరు వేటగాండ్లు కావడం వల్ల, వేటలో జీవించేవారు కావడం వల్ల ఆ పేరు వచ్చిందని చెప్తారు. సరే, శత్రువుల్ని అంధులుగా చేసేవారు - ఆంధ్రులు అని కూడా అర్థంచెప్పారు. 'తెనుగు' పదమే ప్రాచీనమని కొందరు, 'తెలుగు' ప్రాచీనమని కొందరు అభిప్రాయపడ్డారు. కాని నన్నయ 'తెనుగు' పదాన్నే వాడాడు. 'త్రినగ' నుంచి తెనుగు ఏర్పడిందని కొందరు, 'తెన్' నుంచి తెనుగు వచ్చిందని కొందరు అంటారు. శ్రీకాళహస్తి, శ్రీశైలం, మహేంద్రగిరి (గంజాంజిల్లా) అనే మూడు కొండలు గల ప్రదేశంగా 'త్రినగ' శబ్దం ఏర్పడిందిట. తెన్ అంటే దక్షిణదిక్కు. దక్షిణ ప్రాంతానికి సంబంధించిన భాష కాబట్టి 'తెనుగు' అయిందని ఎక్కువమంది అంగీకరించారు.

మనం ఎక్కువగా వాడే పదం 'తెలుగు.' మన ప్రాంతానికి పూర్వం త్రిలింగదేశం అనే పేరుండేది. శ్రీశైలం, కాళహస్తి, దక్షారామం (ద్రాక్షారామం) అనే పుణ్యక్షేత్రాల్లో గల మూడు శివలింగాలు ఆధారంగా త్రిలింగ - తి అలింగ - తెలింగ - తెలుంగు - తెలుగు అయిందని చెప్తారు. మరికొందరి అభిప్రాయం ప్రకారం త్రి కళింగ నుంచి తెలుగు ఏర్పడింది. మొత్తంమీద ఆంధ్ర - తెలుగు - తెనుగు మూడూ ఒక్కటే. తెనుగు ప్రాచీనమైంది అనుకొంటే 'ల - న' లు మారటం తెలుగు లో సహజం కాబట్టి (ములుగు - మునుగు, లేదు - నేదు) తెనుగు - తెలుగుగా మారిందని చెప్పవచ్చు.

## తెలుగు భాష ఎప్పటి నుంచి వుంది?

క్రీస్తు పూర్వం నాటికే ఆంధ్రజాతి ఉన్నదంటే - మరి అప్పటినుంచే ఆంధ్రభాష ఉందా? వాళ్ళే భాషలో మాట్లాడుకొనేవారు? సొంత భాష ఉందా? లేక మరోభాషలో మాట్లాడుకొనేవారా? మొదలైన ప్రశ్నలకి సాక్ష్యాధారాలతో జవాబులు దొరకటం కష్టం. మనకి తెలిసినంతవరకు శాతవాహనులే ఆంధ్ర దేశాన్ని పాలించిన మొదటి రాజులు. మరి శాతవాహనులనుంచి విష్ణు కుండినులు దాకా శాసనాలు తెలుగులో వేయించలేదు. ప్రాకృత భాషలో వేయించారు. ఆ తర్వాత సంస్కృతభాషలో కనిపిస్తాయి. అయితే ఆనాడు వీళ్ళంతా పరిపాలించిన ప్రాంతంమాత్రం తెలుగు ప్రాంతమే అనడానికి శాసనాల్లో, ప్రాకృత గ్రంథాల్లో కనిపించే తెలుగు పదాలూ, ప్రత్యయాలూ నిదర్శనాలు. కొందరు ఆంధ్రులు వేరు తెలుగువారు వేరు అనికూడా అంటారు. క్రీ.శ.575లో కడపజిల్లా - ఎర్రగుడిపాడులోగల చెన్నకేశవస్వామి ఆలయంలో రేనాటి చోళుడైన ధనంజయుడు వేయించిన శాసనమే తెలుగులో మొట్టమొదటి శాసనం. క్రీ.శ.848 ప్రాంతంనాటి పండరంగని అద్దంకి శాసనం మొట్టమొదటి తెలుగు పద్యశాసనం. 898నాటి యుద్ధమల్లుని బెజవాడ శాసనంలో కవిత్వ పద్ధతి కనిపిస్తుంది. ఆదికవి అయిన నన్నయ తన భారతాన్ని సంస్కృత శ్లోకంతో ప్రారంభించినా - 'రాజకులైక భూషణుడు, రాజమనోహరుడన్యరాజ...' అనేది తొలి తెలుగు కావ్యంలో తొలి పద్యం. క్రీ.శ. ఒకటో శతాబ్ది నాటి హాలుని 'గాథాసప్తశతి' లో కూడా తెలుగు పదాలు కనిపించాయి కాబట్టి తెలుగు క్రీ.శ. ఒకటవ శతాబ్ది నాటికే ప్రచారంలో వున్నా శాసనాల్లో ఆరో శతాబ్దం నుంచి వాడకం ఎక్కువగా వున్నా కవిత్వం పదకొండో శతాబ్దం నుంచి మాత్రమే కనిపిస్తోంది!

## పూర్వం తెలుగు ఇలావుండేదా?

''స్వస్తిశ్రీ ఎరికల్ ముత్తురాజుల్ల కుణ్డికాళ్ళు [ని]వబుకాను
ఇచ్చిన పన్నస దుజయ రాజుల ముత్తు రాజులు నవప్రియ
ముత్తురాజులు వల్లవదుక రాజులు సక్షికాను ఇచ్చి[న] పన్నస్స

కొట్టంబున పాఱకు కుణ్డి కాళ్ళుళ ఇచ్చిన పన్నస
ఇరవది యాది నాల్కు మఱున్తుఱ్లు నేల... '

ఇదీ తెలుగు భాషే! క్రీ.శ.575 నాటిది. మొట్టమొదటి తెలుగు శాసనంలోని భాష ఇది! పూర్వం తెలుగు ఎలా వుండేదో తెలుసుకోవాలంటే ఆనాటి శాసనాలే ముఖ్యమైన ఆధారాలు. అమరావతి స్తూపంమీద గల 'నాగబు' అనేది తెలుగులో మొట్టమొదటి పదం అంటారు. శాతవాహనుల కాలం నాటి వెండి నాణాలమీద ఒక ప్రక్క ప్రాకృతంలోనూ, మరో ప్రక్క తెలుగులోనూ రాయబడివుండేది. ఆనాటి ఒక నాణెం మీద వున్నట్టు పరిశోధకులు నిర్ణయించిన క్రింది వాక్యం కూడా తెలుగు వాక్యమే అంటే నమ్ముతారా? -

''అరహిణిష వాహిట్టి మాకనషతిరుహాత కణిష''

నన్నయ కాలంనాటి తెలుగుభాష వేరు. నన్నయకి ముందున్న తెలుగు భాష వేరు. నన్నయకి ముందు గల తెలుగు భాషలో 'ఱి' అనే అక్షరం వుండేది. ఇది ఇప్పటికీ తమిళంలో వుంది. ఇది తర్వాత ళ-డ-ఱ-ర లుగా మారిపోయింది. అప్పట్లో చోఱి (చోళ)· తోఱి (తోడ); ఊఱ్ల (ఊర్ల) వంటివి వాడేవారు.

పూర్వం 'వలపలగిలక' అనే మరో గుర్తు వుండేది. దీన్ని రకారానికి బదులుగా వాడేవారు. దీని గుర్తు 'ఒ.' యాభై సంవత్సరాల క్రితం కూడా చాలామంది దీన్ని వాడేవారు.

వర్మకి బదులుగా 'వమ్మ౯' అనీ

పార్థివేంద్రకి బదులుగా 'పాత్థి౯వేన్ద్ర అనీ రాసేవారు.

ఇంకా ఆనాటి తెలుగుభాషలోని విశేషాలను కొన్నిటిని తెలుసుకుందాం.

వాణ్డు, మూణ్డు (వాడు, మూడు)
పఞ్చ లేక పఞ్చ (పంచ)
ఎఱుంబొది (ఎనిమిది)
నాణ్డు (నాడు)
తోణ్ట (తోట)

బారనాసి (వారణాసి)

చిఱుమ్నూరు (చిలంకూరు)

తూర్కశర్మ, కొండాచార్య, దొణశర్మ, కుప్పనయ్య (మనుషులపేర్లు)

కొట్టపాలు, ఉర్పుటూరు, పామ్బుల్లు, మల్కబోరము (ఊళ్ళపేర్లు)

## ఇంతకీ తెలుగులో అక్షరాలు ఎన్ని?

తెలుగు భాషకి అక్షరాలు ఎన్ని? అని అడిగితే తడుముకోకుండా ఠక్కున సమాధానం చెప్పగల తెలుగు మేష్టర్లు కూడా తక్కువమందే వుంటారు. తెలుగులో వ్యాకరణాలు రాసిన ఇద్దరూ రెండు రకాలుగా చెప్పారు. భాషాశాస్త్రం ప్రకారం అక్షరాల సంఖ్య మరో విధంగా ఉంది.

బాలవ్యాకరణం రాసిన చిన్నయసూరి తెలుగు భాషకి 36 అక్షరాలన్నాడు. ప్రౌఢవ్యాకరణం రాసిన బహుజనపల్లి సీతారామాచార్యులు ఆంధ్రభాషకి 55 అక్షరాలని చెప్పాడు. తెలుగు భాష వేరా? ఆంధ్రభాష వేరా? అనే మీమాంస ఎలాగో వుంది. కేవలం తెలుగు పదాలే కాకుండా సంస్కృత ప్రాకృతాలు గలది ఆంధ్రభాష అనేది కొందరి మాట. చిన్నయసూరి తెలుగు వర్ణాలలో విసర్గని చేర్చటం విశేషం. భాషాశాస్త్ర వేత్తలు వాడుక తెలుగు ఆధారంగా 28 అక్షరాలను పేర్కొన్నారు. ఇంతకీ చిన్నప్పటినుంచి నేర్చుకుంటున్న 'క్ష'ని ఎవ్వరూ పేర్కొనలేదు. ఎందుకంటే అది రెండక్షరాల కలయిక కాబట్టి. అసలు మన తెలుగులో సంస్కృతంలోని ఋ, ౠ, ఌ, ౡ లు విసర్గ లేనేలేవు. అలాగే ఘ,ఖ,ఝ ఠ,ఙ,ఞ లు కూడా పూర్వం ఉచ్చారణలో స్పష్టతకోసం, అర్థ స్పష్టత కోసం ౘే (ౘాప), ౙే (ౙెల్లెడ) అనివాడేవారు ఇటీవల తెలుగులోకి ఎఫ్ (f) లా పలికే 'ఫ' ఒకటి బాగా ప్రచారంలోకి వచ్చింది. పఫలలోని 'ఫ' రాసి ఎఫ్ లా పలుకుతాం. కాఫీ, ఫలం, మాఫీ, సాఫీ వంటి పదాలలో ఈ 'ఫ' కనబడుతుంది - వినబడుతుంది. ఇంగ్లీషు హిందీభాషల ప్రభావంతో వచ్చిన అక్షరం ఇది. చాలాకాలంనుంచి అలవాటులో వున్న తెలుగు అక్షరాలు 52. అవి -

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఎ ఏ ఐ ఒ ఓ ఔ అం అః

క ఖ గ ఘ ఙ

చ ఛ జ ఝ ఞ

ట ఠ డ ఢ ణ

త థ ద ధ న

ప ఫ బ భ మ

య ర ల వ శ ష స హ ళ

## తెలుగులో ఎన్నిరకాల మాటలున్నాయి?

తెలుగులో ఉన్న మాటలన్నీ అచ్చమైన తెలుగు మాటలు కాదు. ప్రపంచంలో ఏ భాషలోనైనా సామాన్యంగా ఇతర భాషాపదాలు తప్పకుండా వుంటాయి. పదాలు ఇచ్చి పుచ్చుకొనే ధోరణి భాషల సహజ లక్షణం. సంస్కృత, ప్రాకృత భాషల్లోంచి ఎక్కువ మాటలు మన భాషలోకి ప్రవేశించాయి. సంస్కృత పదం లేకుండా తెలుగును వాడలేని పరిస్థితి కూడా ఏర్పడింది. ఇప్పుడు ఇంగ్లీషు మాట లేకుండా మాట్లాడటం, రాయటం కష్టమైంది గదా! తెలుగులో గల మాటల్ని

తత్సమాలు
తద్భవాలు
దేశ్యాలు
అన్యదేశ్యాలు
గ్రామ్యాలు

అని చెప్పారు. సంస్కృత భాషలనుంచి - దాదాపుగా సమానంగానే తెలుగులోకి వచ్చిన మాటల్ని తత్సమాలు అన్నారు. సంస్కృతంలో 'రామః' అని వుంటే తెలుగులో 'రాముడు' అయింది. రాముడు తత్సమం అన్నమాట! ఇలాగే వనిత, జగత్తు, సరస్సు, విరాట్టు మొదలైనవి తత్సమాలు అవుతాయి. అగ్గి, రాణి సిరి, సింగారం, గారవం వంటివి ప్రాకృతం నుంచి తెలుగులోకి వచ్చిన తత్సమాలు (అంటే ప్రాకృత సమాలు).

సంస్కృత, ప్రాకృత భాషల్లోంచి పుట్టిన పదాలు అంటే అనేకరకాలుగా ఎక్కువ మార్పులు చెంది తెలుగులోకి వచ్చిన మాటల్ని తద్భవాలు అన్నారు తత్సమంగా మారిన తర్వాత తద్భవంగా మారడం సహజ లక్షణం

తత్సమాలను ప్రకృతులనీ, తద్భవాలను వికృతులనీ అంటూ వుంటాం.

ఉదాహరణలు -

| తత్సమం | | తద్భవం |
|---|---|---|
| రక్తము | - | రకతము |
| విజ్ఞప్తి | - | వినతి |
| చిహ్నము | - | చిన్నె |
| శ్రేష్ఠి | - | సెట్టి |
| ప్రయాణము | - | పయనము |

అసలు సిసలైన తెలుగు మాటల్ని 'దేశ్యాలు' అన్నారు. తెలుగుదేశంలోనే పుట్టి, వాడబడేవి అన్నమాట. అంటే ఇతర భాషలతో సంబంధం లేని మాటలు దేశ్యాలు. నేను, చెట్టు, కన్ను, మొదలు, మన్ను, అమ్మ, చదువు, నేల, ఆకు, మొదలైనవి. ఈ పదాలకి సంస్కృత పదాలకి సంబంధం లేదు కాబట్టే తెలుగు సంస్కృతంలో నించి పుట్టలేదని చెప్పారు. తెలుగులోమనం వాడే పరీక్ష, విద్యార్థి, ప్రార్థన, గ్రంథం మొదలైనవి తెలుగుమాటలు కాదు - సంస్కృతంలోంచి వచ్చినవే మరి!

ఇతర భాషలనుంచి తెలుగులోకి వచ్చిన మాటల్ని ''అన్యదేశ్యాలు'' అన్నారు. సంస్కృతం, ప్రాకృతం భాషల్ని మనవాళ్ళు ఇతర దేశాల భాషలుగా గుర్తించలేదు - అవి మన దేశంలోవే అని! పోర్చుగీసు, డచ్, ఉర్దూ, ఇంగ్లీషు భాషల్లోంచి వచ్చిన మాటల్ని అన్యదేశ్యాలు అంటారు. వివిధ కాలాల్లో విదేశీయులు పరిపాలించడం వల్ల, వ్యాపారాలు చెయ్యడం వల్ల వాళ్ళ భాషలోని మాటలు మన భాషలోకి వచ్చి చేరాయి. అయితే అరబిక్, పర్షియన్, ఉర్దూ భాషల పదాలే ఎక్కువగా వచ్చాయి. ఇవి హిందీలోకి వెళ్ళి అక్కడినుంచి తెలుగులోకి వచ్చినవీ వున్నాయి. ఇంగ్లీషువాళ్ళ పరిపాలననుంచి మన తెలుగులోకి ఇంగ్లీషు పదాల ప్రవాహం మొదలైంది.

మన వ్యాకరణాల్లో 'గ్రామ్యాలు' అని కొన్ని మాటల్ని పేర్కొన్నారు. గ్రామాల్లో నివసించే ప్రజలు మాట్లాడుకొనే భాషని ''గ్రామ్యం'' అన్నారు. అంటే వ్యాకరణం ప్రకారం నియమనిబంధనలు లేకుండా వాడబడే మాటల్ని

గ్రామ్యాలు అన్నారు. అంటే లెగు, కూకో, వన్నం, ఇసయం, సాములోరు, వత్తా వంటివన్నమాట! ఇటువంటి గ్రామ్యభాషకి గ్రంథరచన లేదా సాహిత్య రచన చేసే యోగ్యత లేదన్నారు. కాని కాలం మారింది. గిడుగు రామమూర్తిపంతులుగారి వల్ల వాడుక భాషకి గౌరవం దక్కింది. భాషాశాస్త్రం ప్రకారం భాషలో తక్కువ ఎక్కువలు. ఉత్తమ నీచాలు ఉండవు. ఇదొక భాషా భేదం - అంతే! ఇటీవల ఈ 'గ్రామ్య' భాషలో కూడా ఉత్తమమైన సాహిత్యం వెలువడింది - వెలువడుతోంది!

## అచ్చతెలుగు అంటే?

'వాడు అచ్చ తెలుగులో మాట్లాడుతున్నాడ్రా' అని అంటూవుంటారు. చాలామందికి అచ్చతెలుగు అంటే అర్థం తెలీదు. అచ్చిక తెలుగు - అచ్చతెలుగూ అయింది. తెలుగు మాటల్లో తత్సమాలు, తద్భవాలు ఉంటాయని చెప్పుకున్నాం గదా! తత్సమాలలో సంస్కృత సమాలు, ప్రాకృత సమాలు వుంటాయి. సంస్కృత సమాలుకాని ఇతర పదాలను అచ్చతెలుగు పదాలు అంటారు. అంటే - ప్రాకృత సమాలు, తద్భవాలు, దేశ్యాలు కలిసి 'అచ్చతెలుగు అవుతుంది. అచ్చతెలుగులో రాయబడిన కావ్యాలూ వున్నాయి

'రాజు' కి ఏలిక, ఎకిమీడు, దొర, పుడమిఱేడు అనేవి అచ్చతెలుగు మాటలు. అలాగే -

'మేఘం' అనటానికి - నీరుతాలుపు, మబ్బు మొగిలు అనాలి. 'బ్రహ్మ' గారు అచ్చతెలుగులో ఎలామారిపోయారో చూడండి-

నొసళ్ళను వ్రాయు దేవర, నలుమొగంబుల వేల్పు తమ్మిచూలి, వేల్పు పెద్ద.

''మనవారిలో కొందఱు నేర్చుకొనిన తెలివి తక్కువ తలంపు వంటి తలంపులుమాని, ఒడలు వంచి తోడివారికి తెలివితేటలు కలిగించి, వారి మేలేమనమేలని యెంచి, మనలో తెలివి గలవారమనుకొనువారు తామునాటి కొలువరుల మనితలంచి...' - ఈవిధంగా రాయటం మనతరమా? అనిపిస్తుంది కదూ?

## తెలుగులిపి గురించి ...

మాట్లాడేభాషని లిఖిత పూర్వకంగా గుర్తించడాన్ని 'లిపి' (script) అంటారు. ఒక్కొక్కభాషకి ఒక్కొక్క లిపి వుంటుంది. లిపి లేని భాషలూ వున్నాయి. ఇంగ్లీషు లిపి వేరు. ఉర్దూ లిపి వేరు. అలాగే తెలుగు లిపి వేరు. మన లిపి పూర్వం ఎలా వుండేది? ఇప్పటిలాగా లేనేలేదు. మనదేశంలోని భాషాలిపులు అన్నీ కూడా క్రీ.పూ.250నాటి బ్రాహ్మీలిపినుంచే పుట్టాయి. ఆయా కాలాల్లో అనేక విధాలుగా మారుతూ ఇప్పటికి ఈ రూపాన్ని సంతరించుకొంది. పదిహేనవ శతాబ్దిదాకా తెలుగు లిపి కన్నడ లిపి (దీన్నే తూర్పు చాళుక్యలిపి అంటారు) ఒకే విధంగా ఉండేదని చెప్తారు. ఆ తర్వాతే వేర్వేరు లిపులుగా మారిపోయాయి. ఇప్పటికీ లిపిలో తెలుగు, కన్నడభాషలకి చాలా పోలికలున్నాయి. మన పరిశోధకులు లిపిలో వచ్చిన మార్పుల్ని ఇలా సూచించారు -



పూర్వం తెలుగు లిపిలో అరసున్న కనిపించదు. మొదట్లో తలకట్టులు లేవు. దీర్ఘాల్ని తెలపటానికి చిన్న అడ్డు గీతలు పెట్టేవారు. ఒక నిలువు గీత రెండు నిలువుగీతలు కామా, ఫుల్‌స్టాప్‌లుగా వాడేవారు. సున్నకి బదులుగా అనునాసికాలు ఎక్కువగా కనిపిస్తాయి. అసలు కొన్ని వాక్యాలు కలిపి మహావాక్యంగా వుండేవి. రాళ్ళమీదా, రాగిరేకులమీదా రాయటం మొదలై ఆ తర్వాత తాటాకులమీదకి వచ్చింది. అప్పటినుంచి తెలుగు అక్షరాలకి ఒక కుదురు, ఒక క్రమం వచ్చింది. తాటాకుల మీద రాయడానికి ప్రత్యేకంగా 'వ్రాయసగాళ్ళు' వుండేవారు. అప్పటికే 'దస్తూరి' కి ప్రాముఖ్యం వుండేది. ముత్యాల కోవలా రాయటం ఒక 'గొప్ప'గా భావించబడేది. దస్తూరికి మనవాళ్ళు ఎంతో ప్రాముఖ్యం ఇవ్వబట్టే 'చూచికాపీ' లు, కాపీ పుస్తకాలు అలవాటయ్యాయి. లిపిలో విడివిడి అక్షరాలతో పాటు కొందరు గొలుసుకట్టుగా రాసేవారు. కొందరిది అర్థం కాకుండా 'బ్రహ్మరాత' లావుంటుంది. అంటే మనకి తెలీని 'బ్రాహ్మీలిపి' నే బ్రహ్మరాత అని కొందరు, మన నుదుట రాసే బ్రహ్మవ్రాత, అని కొందరు అర్థం చెప్తారు.

అసలు మాట్లాడే భాష వేరు. రాసే భాష వేరు. మాట్లాడినట్టుగా రాయలేం. రాసినట్టుగా మాట్లాడనూలేం. ఏ భాషలోనైనా ఇది మామూలే. ఇంగ్లీషులో ఈ భేదం మరీ ఎక్కువ గదా! 'మధ్యాహ్నం' అని రాస్తాంతప్ప అలాగే పలుకుతామా? మజ్జాన్నం అంటాం. జాగ్రత్తగా గమనిస్తే బ్రహ్మగారు పలకటంలో బ్రమ్హ అవుతాడు. అలాగే మామా, ఏమోయ్ వంటి వాటిని మనం పలికినట్టు రాయలేం. ఇతరభాషా పదాల్ని మన లిపిలో రాసేటప్పుడు కూడా చిక్కులున్నాయి. అందుకనే బ్యాంకు, బేంకు, మొదలైన విధంగా రాయాలి. ఇటీవల బ్యాంకు, మ్యాచ్, మ్యాన్ అనేవిధంగా స్థిరపడ్డాయి. రష్యన్ భాష, చైనీస్, జపనీస్ భాషల పేర్లను మనభాషలోకి రాసేటప్పుడు తేడాలు తప్పవు.

ముద్రణాయంత్రాలు, కంప్యూటర్‌లూ, డి.టి.పి.ప్రెస్సులూ వచ్చిన తర్వాత రాయటం అలవాటు తగ్గిపోయింది. అసలు ఉత్తరాలు రాయటమే

తగ్గిందికదా! - చాలామంది 'రాత' లు బాగుండకపోవడం గమనిస్తాం. అయితే పుస్తకాలు అచ్చువేసేటప్పుడు మాత్రం కొత్తరకాల్లో ఆర్టిస్టుల చేత పేర్లు రాయించడం వుంది. బాపూలిపి, శీలావి లిపి, చంద్ర లిపి, వడ్డాది పాపయ్య లిపి ...ఇలా ఒక ముద్ర లేకపోలేదు. అందంగా లేకపోతే ఫరవాలేదు గాని బ్రహ్మరాతలా వుంటేనే చిక్కు మరి!

## అక్షరాలలో వింత మార్పులు!

పదాల్లో గల అక్షరాలు కాలక్రమంలో ఎన్నో మార్పులకి లోనవుతూంటాయి. అశ్రద్ధ వల్ల, అనుకరణ వల్ల, చమత్కారం వల్ల, ఉచ్చారణా సౌకర్యం వల్ల ఈ మార్పులు జరుగుతూ వుంటాయి. తెలుగు పదాల్లో అక్షరాలలో జరిగే మార్పులు కొన్నిటిని గమనిద్దాం:

పూర్వకాలంలో 'వాన్టు' అనేది వాన్డు - వాండుగా మారి 'వాడు' అయింది. ఇలా శాసనభాష, నన్నయభాష, తిక్కనభాష, ప్రబంధ భాషలు ఆధారంగా ఎన్నోమార్పులు జరుగుతుంటాయని చెప్పవచ్చు. ''కావ్యభాష'' వ్యాకరణాన్ని బట్టి ఏర్పడుతుంది కాబట్టి ఆ భాషలో మార్పులు మరో విధంగా వుంటాయి. అక్కడ నియమ నిబంధనలుంటాయి. వాటినే సంధులు, సమాసాలు, కారకాలు అని పేర్లు పెట్టి వివరిస్తారు.

వాడుకలో మనం వాడే ''మొహం'' ''ముఖము'' నుంచి ఏర్పడిందే. ముఖము - మొగము - మొగంగా మారి చివరికి మొహం అయింది. ఒకనాటి తేనియ, నూనియలు ఈనాడు తేనే, నూనె అయ్యాయి. వలదు నుంచే ''వద్దు'' వచ్చింది. అలాగే కొలది - కొద్ది, చలిది - చద్ది, తరుగు - తర్గు - తగ్గు అయ్యాయి.

''చిలుక'' ''చిల్క'' గా, పలుకుని 'పల్కు' గా మార్చుకున్నాం. ''అర్పణము'' ను ''అప్పనం''గా తెచ్చుకున్నాం. ''వంగకాయ'' అంటే మన వంకాయ! పెత్తనం అంటే మనం సహించం కానీ - అది ''పెద్ద తనము'' అంటే గౌరవిస్తాం కదా! పూర్వం పచ్చళ్ళు పెట్టడానికి రాచ్చిప్పలు వాడేవారు. అది ''రాతిచిప్ప'' నుంచి వచ్చిందే.

క్రొత్త - కొత్త గానూ, ప్రాత - పాత గానూ, వ్రాత - రాత గానూ మార్చుకొన్నాం. అంతే కాదు - రక్తం నుంచి 'రకతము' వచ్చింది. యాత్రని 'జాతర' చేసుకున్నాం. రాత్రిని 'రాతిరి' గా మార్చుకొనటమే కాదు - 'రేతిరి' గా చేసేశాం. 'వత్తు' ఉన్నప్పుడు వాటిని తీసేశాం. ఉదాహరణలు -

సఖి - సకి; పీఠము - పేట; కాష్ఠము - కట్టె; ఫలకము - పలక.

అందాక, ఎందాకలో వున్న 'దాక' ఏమిటో తెలుసా? 'దనుక' నుంచి 'దాక' వచ్చింది. మనం ఇష్టపడే సంపెంగ 'చంపక'! వన్నెచిన్నెలు వర్ణియ, చిహ్నములనుంచి ఏర్పడినవే. ప్రపంచం అంటే చాలదూ - ప్రపంచకం అంటాం. అలాగే అసలు 'బొటవ్రేలు'అను మధ్యలో 'న' చేర్చి 'బొటన వ్రేలు' చేసుకొన్నామని అంటారు.

ఒకే మాటలో గల అక్షరాలు కూడా తార్మారు అవుతూ వుంటాయి. 'నవ్వులాట' - 'నవ్వుటాల' గా మారింది. అలాగే జగదొంగ, జగఈతగాడు అనేవి గజదొంగ, గజఈతగాడు గా మారాయట! కీచడ్‌పల్లి - చిక్కడపల్లి గానూ దిల్‌ఖుష్‌నగర్ - దిల్‌సుఖ్‌నగర్ గానూ మారటానికి కూడా అక్షరాల తార్మారే కారణం. సంస్కృతంలోని పారువం తెలుగులో పావురం!

మొగము - మోము అయితే పొగవు పోపు అయింది. పొగవచ్చేదాకా పెట్టేదే పోపు అన్నమాట! మన గుమ్మడి - సంస్కృతంవాళ్ళ కూష్మాండమే. వెళ్ళాడంట, చేశాడంట, వెళ్ళాడట, చేశాడట - అనేవి వాడుతూవుంటాం గదా! ఇందులో అంట, అట లు 'అనుట' నుంచి మార్పుచెంది ఏర్పడ్డాయి.

కొన్ని పదాల్ని చూసి, విని అదే మాదిరి కొత్త వాటిని తయారుచేసి తప్పయినా సరే వాడతాం. నడవడిక అనేది తప్పు. అయితే కోరిక వంటి మాటల వల్ల ఇది ఏర్పడింది. ప్రాముఖ్యత, ప్రావీణ్యతలు సరికావు. ప్రాముఖ్యము, ప్రావీణ్యము అనాలి. పూజనీయ, గణనీయ వంటి వాటిని చూసి తప్పయినా సరే 'గౌరవనీయ' ని వాడుతున్నాం.

కొంతమంది చక్కగా, పవిత్రంగా, తప్పుల్లేకుండా వాడాలన్న తాపత్రయంతో తప్పులు వాడటం సహజం. త్రెంచు, ప్రక్కలలో రకారం ఉండదు. ఆరతి, అంశము అనే వాటిని హారతి, హంశము అంటారు. పుస్తకాన్ని, పాపం పుస్తుకం చేస్తారు. 'భావ గారు' అంటే గౌరవం అనుకుంటారు. ఉయ్యాల-ఉయాల, అక్కట-అకట చిలుకు-చిల్క అని రెండు రకాలుగానూ వాడటం మరోవిశేషం.

మనం ఇతర భాషాపదాల్ని కూడా మన ఇష్టం వచ్చినట్టు మార్చుకుంటాం. వాటిని సొంతం చేసుకోవటంలో స్వేచ్ఛను చూపిస్తాం.

కాగజ్‌ని కాగితం, కాయితంగా మార్చుకోలేదూ? కరార్-ఖరారు అయింది. జప్త్-జప్తు అయింది. 'జమీన్‌దార్' అన్నది 'జమిందారు' కాగా 'తన్‌కీ' కాస్తా తనఖా అయింది. ఖబర్ ని 'కబురు' చేశాం. 'ఖండియా' ని 'కండువా' చేసుకొన్నాం. గాబరా' అన్నది 'ఘబ్రా' నుంచి వచ్చిందే. 'పహ్రా హుషార్' అనేది పారాహుషార్ గా మారింది. 'అమానతు'ని అక్షరాల తార్మారుతో 'అనామతు' చేశారు. దుకాన్‌ని 'దుకాణం' చేశాం. బ్యాంకులో వాడే చలాన్ - చాలాన్ నుంచి వచ్చిందే.

## ఇంగ్లీషు మాటల్లో అక్షరాల గమ్మత్తులు

ఇంగ్లీషు వాళ్ళ పరిపాలన పోయినా ఇంగ్లీషు భాష ప్రభావం రోజు రోజుకీ బలపడుతోంది. అది అంతర్జాతీయ భాష అవటమే దానికి కారణం. ఇంగ్లీషు భాష అత్యవసర భాష అయింది దేశభాషలన్నిట్లోకి ఇంగ్లీషు చొచ్చుకు పోయింది. నిరక్షరాస్యుడు కూడా ఇంగ్లీషు మాటలు వాడటం సర్వసాధారణమైంది కాబట్టి తెలుగు వాళ్ళ ఇంగ్లీషు వేరుగా వుంది. తెలుగు భాషకి అనుగుణంగా, తెలుగువాళ్ళ ఉచ్చారణకి అనువుగా అక్షరాలలో మార్పులు జరుగుతూ వుంటాయి. ఇంగ్లీషు మాటలు ఎక్కువగా హల్లులతో ముగుస్తాయి. కానితెలుగు మాటలు అచ్చులతో ముగుస్తాయి. కాబట్టి ఇంగ్లీషు మాటల చివర అచ్చులు చేర్చి తెలుగుగా మార్చుకోవటం గమనిస్తాం.

రోడ్ - రోడ్డు

రైల్ - రైలు
టిక్కెట్ - టిక్కెట్టు
కాలేజ్ - కాలేజి
స్విచ్ - స్విచ్చి
క్లబ్ - క్లబ్బు

కొన్ని పదాల్లోని అక్షరాల్ని 'షార్ట్‌కట్' చేసి వాడేస్తాం. 'కిలోగ్రామ్' వంకాయలు ఇవ్వమని అనం - 'కిలో' వంకాయలు అంటాం. 'టెలిఫోన్' ని ఫోనుగా కత్తిరించేశాం. రిఫ్రిజిరేటర్ కాస్తా ఫ్రిజ్ అయింది. 'బైసికిల్'ని 'బైక్' అంటారు. 'ఎలక్ట్రిక్ కరెంట్' ని 'కరెంట్' గా మార్చుకున్నాం. 'స్కూల్' ని స్కూలుగా మార్చుకొని ఊరుకొన్నామా-'ఇస్కూలు' అనేశాం. 'ఏటమ్'ని 'ఆటం' చేశాం. సూపరింటెండెంట్ గారు కాస్తా పాపం ఎలా మారిపోయారో చూడండి-

సూపర్నెంట్ - సూపరెంట్

అలాగే కానిస్టేబుల్‌ని కానిస్టీబు గా మార్చి హెడ్ కానిస్టేబుల్‌ని 'హేడు' గారుగా చేసేశాం. ఉచ్చారణలో లైబ్రరీ కి బదులు లైబ్రీ అనటం గమనిస్తాం. 'హస్పిటల్' కాస్తా ఆస్పత్రి, ఆసుపత్రి అవలేదూ? కలెక్టర్ - కలకటేరు గా మారడం సరే - అసలు ఇంగ్లీషునే ఇంగిలిపీసు చేసేశాంగదా!

## ఎన్నో మాటలు - అర్థంమాత్రం ఒకటే మరి!

ఒక భావాన్ని చెప్పడానికి సామాన్యంగా ఒక మాట వాడుతూంటాం. అయితే అన్ని సందర్భాల్లోనూ అందరూ ఒకే భావానికి ఒకే మాటని వాడరు కూడా. అంటే వేర్వేరు వ్యక్తులు వేర్వేరు మాటల్ని వాడటం గమనించవచ్చు. ఇలా ఒకే అర్థం గల రక రకాల మాటలు - పర్యాయ పదాలు - (synonyms) అన్ని భాషల్లోనూ ఉంటాయి. వీటి అవసరం కవిత్వంలో ఎక్కువయినా వాడుకలో కూడా వుంది. అమ్మ తల్లి, బాబు, అయ్య వంటి పదాల్ని ఎలా పడితే అలా వాడకూడదు. కొన్ని చిక్కులు

ఏర్పడతాయి. చాలా మంది చెప్తున్నదే -

'మీ నాన్న వున్నాడా' అన్న దానికి,

'మీ అమ్మ మొగుడున్నాడా' అన్న దానికి,

ఎంత తేడా వుందో తెలిసిందే. అర్థం ఒకటే గదా అని వాడ కూడదు. అందువల్ల సమయ సందర్భాలకి అనుగుణంగా వాడటానికి పర్యాయ పదాలు తోడ్పడతాయి.

ఉపన్యాసాల్లో, సాహిత్య రచనలో వాడిన మాటనే పదిసార్లు వాడకుండా వాటికి బదులు మరోమాట వాడితే ఔచిత్యంగా వుంటుంది. 'అధికం' అనటానికి ఎక్కువ, అత్యంతం, బహుళం, మిక్కిలి అనవచ్చు. సాహిత్యంలో తర్దయు, భూరి వంటివి వున్నాయి. ''భూరి విరాళం'' అని అంటూ వుంటారు. భూరి అంటే ఎక్కువ అని అర్థం. సుందరం, సింగారం, సొబగు, కొమరు, చెన్ను - ఇవన్నీ 'అందం' కోసమే. పాటల్లో, ఛందస్సులో ఏ పదం సరిపోతుందో ఆ పదం వాడుకోటానికి సులువవుతుంది. ఈశ్వరుడు, లక్ష్మీదేవి, పార్వతి, మన్మథుడు వంటి వాటికి ఇరవైఅయిదు నుంచి అరవై దాకా పర్యాయ పదాలున్నాయి. కొన్నిటిని చూడండి.

స్త్రీ కి ముప్పయికి పైగా మాటలున్నాయి. ప్రాచీన కవిత్వంలో కవులు ఈ పర్యాయ పదాల్ని బాగా వాడారు. అబల, నారి, వనిత, మహిళ, సీమంతిని, అంగన, కామిని, కాంత, మానిని, లలన, రమణి, మగువ, సుదతి, పడతి, నాతి, ఇంతి, నవల, అతివ, కొమ్మ, వెలది, లేమ మొదలైన వాటికి 'ఆడుది' అని అర్థం.

'చావు' కి కూడా మనం ఎన్నోమాటల్ని వాడుతూంటాం. ఎన్ని విధాలుగా 'చస్తామో' చూడండి -

చనిపోయాడు

మరణించాడు

స్వర్గస్థుడయ్యాడు

పరమపదించాడు

కన్నుమూశాడు

శివసాయుజ్యం చెందాడు

దీర్ఘనిద్రపోయాడు

నూకలు చెల్లాయి

తుదిశ్వాస విడిచాడు

పంచత్వం చెందాడు

తనువు చాలించాడు

కీర్తిశేషుడయ్యాడు

మృతి చెందాడు

బాల్చీ తన్నాడు

దివంగతుడయ్యాడు

చనిపోయిన ప్రతివాడూ స్వర్గానికి వెళ్ళకపోయినా - ఆకాంక్షగా 'స్వర్గస్థుడయ్యాడు' అంటారు. ఈ శరీరం పాంచభౌతికం కాబట్టి చనిపోయాక మళ్ళీ పాంచభౌతిక మవుతుంది. అని 'పంచత్వం చెందటం' లో వుంది. చనిపోయాక కీర్తి మిగిలింది కాబట్టి కీర్తిశేషుడవుతాడు. ఇప్పుడు దుర్మార్గుడు కూడా కీర్తిశేషుడే! ఇంగ్లీషువాళ్ళు బకెట్ బోర్లా వేసి, దాని మీద నుంచొని ఉరి వేసుకొని - చివర్లో బకెట్‌ని తన్నేసి ఆత్మహత్య చేసుకొనే వారట. అందుకే మనవాళ్ళు 'బాల్చీ తన్నేశాడని' చావుని 'సరదాగా' చెప్తారు. కొందరు చావుకి 'హరీ అన్నాడు' అనటమూ వుంది. పైకెళ్ళాడు, పోయాడు వంటి మాండలికాలూ వున్నాయి.

టోపీ వెయ్యడం, టోకరా వెయ్యడం, హేండివ్వడం, హోత్ ఇచ్చాడు - ఇవి మోసానికి వాడేవి. వాడుకలో ఇటువంటివి చాలా వున్నాయి. నిఘంటువుల ప్రకారం పర్యాయపదాలను పరిశీలించండి.

అరటి - కదళి, అనటి, రంభ, సప్తవర్ణం

నీరు - ఉదకం, పానీయం, జలం, తోయం, వారి, అంబు, జీవనం, సలిలం

ఏనుగు - హస్తి, గజం, దంతి, సామజం, కరి, ఇభం, అనేకపం, మాతంగం, కుంజరం, కలభం

గుఱ్ఱం - తురగం, అశ్వం, వాజి, తేజి, వారువము, సారంగం, హయం, ఘోటకం, కత్తలాని.

చంద్రుడు - ఇంద్రుడు, హిమాంశవు, నిశాపతి, సోముడు, మృగాంకుడు, సుధాంశుడు, జాబిల్లి, కుముద బాంధవుడు, శశిధరుడు, చందమామ, వెన్నెలతేడు, చుక్కలదొర, తారాపతి, చలివెలుగు

కోపము - క్రోధం, రోషం, అలుక, కినుక, అమర్షం.

తెలుపు - శ్వేతం, పాండురం, ధవళం, సిత, తెల్ల, వెల

వాయుదేవుడు - అనిలుడు, గంధవహుడు, సమీరుడు, మరుత్తుడు, పవనుడు, ప్రభంజనుడు, శ్వసనుడు, జగత్ప్రాణుడు, వాతుడు, ప్రకంపనుడు, నీటితాత, మరుతేరు.

పర్వతము - శిఖరి, కొండ, అచలం, శైలం, మల, అద్రి, గుబ్బలి, గిరి.

ఇటీవల పిల్లలకి కొత్త పేర్లు పెట్టాలనే ఆసక్తి ఎక్కువవుతోంది. నక్షత్రాన్ని బట్టి పేర్లు పెట్టాలంటారు. కాబట్టి ఈ పర్యాయ పదాల్ని తెలుసుకోవటం వల్ల కొత్తకొత్త పేర్లు - ఆధునికమైన అభిరుచులను బట్టి పెట్టుకొనే వీలు ఏర్పడుతుంది.

## ఒకే మాటకి అర్థాలెన్నో!.

సామాన్యంగా ఒక మాటకి ఒక అర్థం వుంటుంది. అయితే సందర్భాన్నిబట్టి, వాడేవాడి ఉద్దేశం బట్టి ఒక మాటకే చాలా అర్థాలుంటాయి. సాహిత్యంలో ఈ అర్థాల్ని సేకరించి ' నానార్థాలు''గా వాడారు. నానార్థాలకి ప్రత్యేకమైన నిఘంటువులే వున్నాయి. మనం రోజూ వాడే భాషలో మనం గమనించని నానార్థాలు వున్నాయి.

'ఆ లెక్కకి ఆన్సర్ రావటంలేదు.'

--- ఇక్కడ లెక్క అంటే తెలుసు.

'నా కివ్వాల్సిన లెక్క ఇవ్వవా?'

--- ఇక్కడ 'డబ్బు' అని లెక్క అర్థం.

'వాడొక లెక్కా?'

--- ఇక్కడ నిర్లక్ష్యం - వాడెంత? అనే భావం వుంది.

ఇదే విధంగా అసలు 'బొక్క' వేరు. కానీ 'బొక్కలో వేస్తాను', 'నాకు రెండు లక్షలు బొక్క వచ్చింది' అన్నప్పుడు బొక్కకి జైలు, నష్టం అనే అర్థాలు ఏర్పడ్డాయి.

ఒక్క 'మాట' అనే మాటకి ఎన్నో అర్థాలున్నాయి. సి.పి.బ్రౌన్ అనే ఆంగ్లేయుడు వాడుకలో గల కొన్ని అర్థాలు తెలిపాడు. మనం బాగా పరిశీలిస్తే 'మాట' కి దాదాపు ముప్పయికి పైగా అర్థాలున్నాయని తెలుస్తుంది. కొన్నిటిని చూడండి -

మాట ఇచ్చాడు.

మాట పడడు.

వాడి మాట సాగుతుంది.

మాటల్లేవు.

మాటలు రావు

వాడి మాట ఏం చేశారు? -

ఒక్క మాటలో చెప్పు.

వాడు మాటలు నేర్చాడు.

వాడి మాట వాడిదే.

మాటవరసకి అన్నాను.

ఆ పని చెయ్యటం మాటలు కాదు.

మనలో మాట.

ఏ మాటకి ఆ మాటే చెప్పుకోవాలి.

మాటకి మాట చెప్తాడు.

ఇంతకీ వాడికి పెళ్ళయిందన్నమాట!

క్రియల్లో కూడా వేర్వేరు అర్థాలు వచ్చేలా వాడటం గమనిస్తాం -

వాడు అన్నం తిన్నాడు.

వాడు తన్నులు తిన్నాడు.

వాడు డబ్బు తిన్నాడు.

ఆ సినిమాలో తిన్నాడు రా.

ఖంగు తిన్నాడు.

సాహిత్యంలో నానార్థాల అవసరం కవులకి చాలా వుంటుంది. రెండర్థాలు, మూడర్థాలు, నాలుగర్థాలు వచ్చే కావ్యాలు కూడా రాశారు. (పింగళిసూరన భారతార్థం, రామాయణార్థం వచ్చేలా ''రాఘవపాండవీయం'' అనే కావ్యం రాశాడు). కొన్ని నానార్థాలు చూద్దాం -

అంబరం - సామాన్యంగా ఆకాశం అని అర్థం. అయితే దిగంబరంలో అంబరం అన్నప్పుడు వస్త్రం అని అర్థం. దూది, అనుస్వారం అనే అర్థాలు నిఘంటువుల్లో వున్నాయి.

అగ్రము - చివర, పైన అనే అర్థాలు మనకి తెలిసినవే. అగ్రగణ్యం, అగ్ర తాంబూలం అన్నప్పుడు 'అగ్ర' అంటే 'మొదటిది' అని అర్థం. దీనికి

ఆధారం, ముఖ్యం అనే అర్థాలూ వున్నాయి.

అర్థము - ఒక మాటకి గల అర్థం. డబ్బు, కార్యం, వ్యవహారం, అక్కఱ.

ఉత్తరము - ఉత్తర దిక్కు, లేఖ. అనేవి కాకుండా సమాధానం, శ్రేష్ఠం అనేవి వున్నాయి. ఉత్తరోత్తరా, పూర్వోత్తరాలు అన్నప్పుడు మీదిది, తర్వాతది అని అర్థం.

ఋణం - అప్పు అని మాత్రమే కాదు, నీరు, నేల అన్న అర్థాలూ లేకపోలేదు.

పదం - శబ్దం, వాక్యం, పాదం, చిహ్నం, పద్యంలో పంక్తి, అడుగు జాడ, భాగం, పాట, అడుగు, కీర్తన.

కవి - 'కవిత్వం చెప్పేవాడు' అనే అర్థం మాత్రమే చాలామందికి తెలుసు. కాని, కవి అంటే పండితుడు, ఋషి, సూర్యుడు, వాల్మీకి.

కంఠీరవం - సింహం, పావురం, మత్తగజం.

జీవనము - నీరు, బ్రతుకు, ప్రాణం, గాలి.

ఋషభము - సంగీతంలో ఒక స్వరం, ఒక ఓషధి, ఒక రాశి, చెవి రంధ్రం, మదించిన ఏనుగు.

మిత్రుడు - 'స్నేహితుడు' అనే అర్థం చాలా మందికి తెలుసు. 'సూర్యుడు' అనే అర్థం కొంతమందికి తెలుసు. కానీ 'శత్రు దేశపు రాజు' అనే అర్థంవున్నట్టు చాలా మందికి తెలీదు.

90351

భోగి 'భోగాలు అనుభవించేవాడు!' అంతే కాదు -దీనికి పాము, రాజు, కరణం, మునసబు అనే అర్థాలూ వున్నాయి.

## పదాల పుట్టుక - అర్థాలు

పదాలు ఎలా పుట్టాయి? వాటి పుట్టు పూర్వోత్తరాలు ఏమిటి? అనే వాటి గురించి తెలుగులో ఎక్కువగా కృషి జరగలేదు. కాల్డ్‌వెల్ అనే ఆంగ్లేయుడి కృషితో ప్రారంభమై ఆధునిక భాషా శాస్త్రవేత్తలు కొంత కృషి చేశారు. పూర్వం సంస్కృత పదాలకే ''వ్యుత్పత్తులు'' వుండేవి. స్కూల్‌లో వ్యుత్పత్తి అర్థాలు సంస్కృత పదాలకే చెప్పేవారు. తెలుగు మాటలకి వ్యుత్పత్తి ఏమిటి? అని సంస్కృత పండితులు వెక్కిరించేవారట! దానిని భరించలేక మారేపల్లి రామచంద్రశాస్త్రి (కవిగారు) గారు తెలుగుమాటల పుట్టుక గురించి ఎంతో పరిశోధన చేసి 'నుడికడలి' అనే నిఘంటువు తయారు చేశారు. అయితే అది పూర్తి కాలేదు. కొంత భాగం దొరుకుతున్నా - అచ్చువేసే వారెవరూ లేకపోయారు. ముందుగా సంస్కృత పదాలకి వ్యుత్పత్తులు తెలుసుకుందాం -

అంబుదం అంటే మేఘం అని అర్థం ఈ అర్థం ఎలా వచ్చింది ? అంబు అంటే నీరు. ద అంటే ఇచ్చేది. నీటిని ఇచ్చేది (కురుస్తుంది) కాబట్టి అంబుదము - మేఘం అయింది రామాయణం లోని 'కైకేయి' తెలిసిందే గదా! ఆ పదం ఎలా వచ్చిందో తెలుసా - కేకయ రాజు కూతురు కాబట్టి 'కైకేయి' అయింది. ఇలాగే ద్రుపద మహారాజు కూతురు - ద్రౌపది! (ద్రౌపతి కాదు). కృష్ణ అంటే నలుపు రంగు. నల్లని వాడు కాబట్టి 'కృష్ణుడు' అయ్యాడు. ఈ క్రింది వ్యుత్పత్త్యర్థాలు తెలుసుకుంటే ఆశ్చర్యం వేస్తుంది - భాషా జ్ఞానమూ అలవడుతుంది.

అంధకారం - లోకులను అంధులుగా చేసేది (చీకటి).

అంతరిక్షం - తనలో నక్షత్రాలు గలది (ఆకాశం).

అధ్యక్షుడు - చర్యలను కనిపెట్టి చూసేవాడు.

| | |
|---|---|
| ఉత్తమాంగం - | శరీరంలోని అవయవాలన్నిటిలోను ఉత్తమమైనది (తల). |
| గిరిజ - | పర్వతాలకు రాజైన హిమవత్ పర్వతానికి (హిమవంతునికి) పుట్టినది (పార్వతి). |
| చత్వారం - | నలభై సంవత్సరాలకు కలిగే దృష్టి దోషం (ఇప్పుడు పదేళ్ళకే చత్వారం వస్తోంది గదా!) |
| దర్పణం - | దీని చేత మంచి వేషాభిమానాలు కలిగి గర్వింతురు (అద్దం). |
| నక్షత్రం - | నాశము పొందనిది. |
| పౌరులు - | పురము (పట్టణము) లోని ప్రజలు. |
| శతఘ్ని - | నూరుమందిని ఏకకాలంలో చంపేది (ఫిరంగి). |
| వినాయకుడు - | తనకు ఇతర ప్రభువులేనివాడు. |
| హర్మ్యం - | మనస్సును హరించునది (ధనవంతుల భవనం). |

## తెలుగు మాటల పుట్టు పూర్వోత్తరాల గురించి కొంచెం తెలుసుకుందాం

మనలో చాలామందికి 'పులిహోర' ఇష్టమే. అయితే దీని అర్థం ఏమిటి? ఇది ఎలా వచ్చింది? 'పులి' కి దీనికి సంబంధం ఏమన్నా వుందా? అనే ప్రశ్నలు కలుగుతాయి. అసలిది పులి + ఓగిరము - అంటే పులిసిన ఆహారం. పుల్లగా ఉండేలా చేసిన ఆహార పదార్థం అన్నమాట! (ఆహారం ప్రకృతి - ఓగిరం వికృతి). 'పలుతోముపుల్ల'ని కుదించేసి 'పందుంపుల్ల' చేస్తాం. ప్రొద్దు అనేది 'పొ దు' నుంచి ఏర్పడిందే. దీని అర్థం సూర్యుడు. తర్వాత 'కాలం' అనే అర్థం వచ్చింది. ఒల్ల + కాటు - అంటే పనికి రాని అడవి. ఇది ఒల్లకాడు అయి - తర్వాత 'వల్లకాడు' గా మారిపోయింది. చెన్+పు=చెంబు అయింది. అంటే ఎర్రని లోహమైన రాగితో తయారు చేయబడిన పాత్ర అని అర్థం. ఇంతకీ అల్లుడు అంటే ఎవరనుకొన్నారు -

అల్లుకు పోయేవాడు. మరొక కుటుంబ సభ్యులతో పెనవేసుకొనే వాడే అల్లుడు! 'తాళ్' అంటే ఆరాధించు అని అర్థం. తొళ్ నుంచే 'తులసి' ని తెచ్చుకున్నాం. పోపు లేనిదే రుచి వుండదు గదా! 'పొగపు' కాస్తా పోపు అయింది. మిర్చి, ఆవాలు వగైరా దినుసులు వేసిన తర్వాత పొగవచ్చేదాకా వెచ్చ జెయ్యాలన్న మాట - అదే పోపు! పెద్దతనమే పెత్తనంగా మారింది.

కురుళ్ అంటే చుట్టుకొను అని అర్థం. చుట్టుకొనేవి కాబట్టి 'కురులు' అయ్యాయి. వేంకటేశ్వరస్వామి భార్యపేరు అలమేలుమంగ (అలివేలు మంగ). 'అలర్మేల్‌మంగై' అంటారు తమిళంలో. అంటే పూవుమీద (తామరపూవుమీద) వుండేది అని అర్థం. 'తాళి' అంటే తాటాకులతో చిన్న బొట్టులాగా చేసేది అని అర్థం అంటారు. 'శుల్కం' నుంచే సుంకం వచ్చింది.

ఇతర భాషలనుంచి ఏర్పడిన పదాలూ కొన్ని వున్నాయి. 'భీమా కంపెనీ' ని తీసుకోండి. పారసీలో 'బీమ్' వుంది. దీని అర్థం 'భయం' (సంస్కృతంలో కూడా భీమ అంటే భయంకరమైన). ఇది ఉర్దూ, పంజాబీ, హిందీ వంటి భాషల్లోకి 'భీమా' గా వెళ్ళింది. జీవితంలో భయాన్ని పోగొట్టే సంస్థగా 'భీమా కంపెనీ' అయింది. పారసీలో గల 'జర్తార్' నుంచే జలతారు ఏర్పడింది. ప్రాకృత భాషలో 'రంభోల్' నుంచి రంకుల, 'రహట్ట' నుంచి రాటం తెచ్చుకొని 'రంకుల రాట్నం' చేసుకున్నాం. అది అపార్థంగా వుందని 'రంగులరాట్నం'గా మార్చేశాం. రంభోల్ అంటే గుండ్రంగా తిరగటం అని అర్థం. తాళంచెవి లోని చెవి 'షావి' అనే పోర్చుగీసు పదం నుంచి ఏర్పడింది. ఇంగ్లీషు వాళ్ళ 'క్లబ్స్' డచ్‌వాళ్ళ 'క్లోవర్' నుంచి ఏర్పడితే మన పేకాటరాయుళ్ళు దాన్ని కళావరుగా మార్చుకొన్నారు. మనకి 'హర్తాళ్' లు అలవాటే గదా! మరాఠీ, గుజరాతీ భాషల్లో 'హడతాళు' వుంది. గాంధీగారు వాడిన అస్త్రాలలో 'హడతాళు' ఒకటి అంటారు. సంస్కృతంలో గల 'హట్ట' నుంచి 'హడ' వచ్చిందనీ - దాని అర్థం బజారు, వీధి అనీ బజారుకి తాళంవెయ్యటం అంటే 'బంద్' చెయ్యటమనీ అర్థం స్థిరపడింది. ఇప్పుడిది ఇంగ్లీషులోకి కూడా

వెళ్ళిపోయింది. పారసీ భాషలో 'దీవాని ఆమ్' అనే పదం వుంది. చక్రవర్తి సామాన్యుల సమస్యలు విని తీర్పులు చెప్పే చోటుని దీవాని ఆమ్' అంటారట. దీన్ని మనం 'దివాణం'గా వాడేస్తున్నాం. ఇలాగే హుటా హుటి హేమాహేమీ, హోరాహోరీ వంటివి కన్నడం నుంచి ఏర్పడితే, సాంబారు సాపాటు తిరుమల, తైరు తమిళం నుంచి ఏర్పడినై. చాడీలు చెప్పటం మనకి కొత్తేమీకాదు గానీ - మరాఠీలోని 'చహాడ్' నుంచే చాడీ వచ్చింది మన పేర్ల చివరగల 'రావు' కూడా మరాఠీ వాళ్ళదే సుమా!

## అసలు అర్థాలే మారుతూవుంటాయ్!

ఒక మాటకి 'ఇదే అర్థం' అని కచ్చితంగా చెప్పలేం. మాటలకి అర్థాలనేవి శాశ్వతం కాదు. సంస్కృతం వాడుకలో లేదు కాబట్టి పూర్తిగా వ్యాకరణానికి లొంగిపోయింది కాబట్టి, ఆభాషలో అర్థాలకి పెద్దమార్పులేవీ ఉండవు. తెలుగు జీవద్భాష. వాడుకలోవుంది. ఎప్పటికప్పుడు ప్రయోగాలు జరుగుతూవుంటాయి. చేర్పులూ మార్పులూ వుంటాయి. ఒక మాటకి ఒక కాలంలో వున్న అర్థం మరో కాలంలోవుండదు. అంతదాకా ఎందుకు - ఒక ప్రాంతంలో ఒక మాటకి ఒక అర్థం వుంటే, అదే మాటకి మరో ప్రాంతంలో మరో అర్థం వుంటుంది. కులాన్ని బట్టి, వృత్తిని బట్టి కూడా అర్థాలు మారుతూ ఉంటాయి. ఇలా ఎందుకు మారతాయి? రాజకీయ, ఆర్థిక, భౌగోళికాది కారణాల వల్ల, మతాలు, ఆచారవ్యవహారాల వల్ల, ఇతర భాషల ప్రభావం వల్ల అర్థాలు మారుతూవుంటాయి. అసలు మనిషి కవితా ప్రియుడు, చమత్కార ప్రియుడు. తాను మాట్లాడేది బాగుండాలని, ఇతరులు మెచ్చుకోవాలని, చమత్కారంగా వుండాలని, పరిహాసం చెయ్యాలని భావిస్తాడు. అందువల్ల గూడా అర్థాలు మారుతుంటాయి. చాలా భాషల్లో ఇలా అర్థాలు మారటం (అర్థ విపరిణామం) కనిపిస్తుంది.

మనందరికీ తెలిసిన 'చెంబు'ను తీసుకోండి. 'ఎఱ్ఱని రాగితో చేసిన పాత్ర' అని అసలైన అర్థం ఇప్పుడు మనం రాగితో చెయ్యకపోయినా

'చెంబు' అనేస్తున్నాం. అంతే కాదు - దానిముందు పదం చేర్చి 'స్టీలు చెంబు, ఇత్తడి చెంబు, ప్లాస్టిక్ చెంబు' అనేస్తున్నాం. ఇంకో తమాషా ఏమిటంటే ''రాగి చెంబు'' అనటం! ఇలా ఫలానా ఆకారంలో వున్న పాత్ర'ని చెంబుగా వాడుతున్నామన్నమాట!

'భోజనం చేశారా'? 'భోజనానికి రండి' అన్నప్పుడూ 'నేను భోజనం చెయ్యను, 'టిఫిన్ చేస్తా' అన్నప్పుడూ భోజనం అంటే అన్నం (మీల్స్) అనే అర్థం వుంది. కానీ - భోజనం అంటే భుజించేది అని అర్థం. ఏది తిన్నా భోజనమే అవ్వాలి. కానీ మనం అన్నం తినటాన్నే భోజనంగా చేసుకున్నాం. జాతరల్లోనూ, పిక్నిక్‌ల్లోనూ, కార్తీకమాసాల్లోనూ 'సంతర్పణలు' జరుగుతూవుంటాయి. అందరికీ భోజనాలు పెట్టడాన్ని సంతర్పణ అంటారు. అన్నదానం కూడా 'సంతర్పణ' అవుతుంది. వాడు సంతర్పణ చేస్తాడు - అన్నప్పుడు అందరికీ ఉచితంగా ఇస్తాడు అనే భావం కూడా వుంది. ఇంతకీ సంతర్పణ అంటే - సంతృప్తి పరచటం అని అర్థం. భోజనం ద్వారా సంతృప్తి పరచడం సంతర్పణంగా మారిందన్న మాట!

చచ్చిపోయిన వాళ్ళకి 'తద్దినాలు' పెట్టడంసరే - ఒక్కొక్కసారి 'తప్పని తద్దినం' గా చిరాకుపడతాం. నిజానికి తద్దినం అనేది చావుకి సంబంధం లేనిది. తత్ + దినం అంటే 'ఆ రోజు' అని అర్థం. ఆ రోజు పుట్టిన రోజు, పెళ్ళి రోజు - ఏదైనా కావచ్చు. కానీ ఎందువల్లనో 'చచ్చిన రోజు'గా స్థిరపడిపోయింది. 'రెండు చీరలు కొన్న వాళ్ళకి ఒక చీర ఉచితం' వంటి ప్రకటనలు చూస్తూవుంటాం. 'ఉచితంగా చూపిస్తారు' అనేది వాడుకలో వున్నదే. ఉచితం అంటే 'తగినది' అని అర్థం. ఇప్పుడది 'ఫ్రీ' గా మారింది. ధర్మం అంటే న్యాయం, విధి, కర్తవ్యం అని అర్థాలు. కానీ ధర్మాసుపత్రి ధర్మ దర్శనం, ధర్మం చెయ్యండి - అన్నప్పుడు అర్థాలు మారటం గమనిస్తాం. 'ఆకు' అంటే అర్థం వేరు. విస్తరాకు, విడాకులు, లోలాకు, బండి (చక్రపు) ఆకు అన్నప్పుడు వేరే అర్థాలు రావటంలేదూ?

'కోక' అంటే ఏమిటి? అని ప్రశ్నిస్తే ఎవరైనా 'చీర' అని చెప్తారు. కాని, పూర్వం ఈ అర్థం లేదు. శ్రీనాథుడనే కవి కూడా 'కోక' ధరించాడు మరి! ఆ కాలంలో కోక అంటే ఒక వస్త్రం మాత్రమే. అంటే అది పంచ, చీర, తుండు ఏదైనా కావచ్చున్నమాట! 'వాసన' అని మాత్రమే అర్థం గల 'కంపు' ఇప్పుడు ముక్కు మూసుకొనే 'కంపు'గా మారిపోయింది గదా!

ఒక్కొక్క సారి ఒక భాగాన్ని చెప్పటానికి వ్యతిరేకార్థం వచ్చేలా చెప్తుంటాం. 'బియ్యం నిండుకున్నాయి' అంటే అర్థం బియ్యం ఉన్నాయని కాదు - బియ్యం లేవు అని. లేవని చెప్పటం శుభం కాదనుకొని అలా చెప్తారు. 'దీపం కొండెక్కింది' అంటే దీపం ఆరిపోయింది అని అర్థం. మర్యాదగా సభ్యతగా చెప్పాలని అనుకోవటం వల్ల కూడా మరో అర్థం వచ్చేలా పరోక్షంగా చెప్తారు ఆవిడ నీళ్ళు పోసుకుంది; ఉత్త మనిషి కాదు; నెల తప్పింది వంటి వాటికి అసలైన అర్థాలు కాక 'గర్భవతి, కడుపుతో వుంది' అని అర్థం. అర్థాల్లో జరిగిన కొన్ని మార్పులు చూడండి -

| పదం | అసలైన అర్థం | మారిన అర్థం |
|---|---|---|
| ముష్టి | పిడికిలి | భిక్ష, అడుక్కోవటం |
| కైంకర్యం | సేవ | మోసం, కాజెయ్యటం |
| ఛాందసుడు (చాదస్తుడు) | ఛందస్సు బాగా తెలిసినవాడు. | లోకజ్ఞానంలేనివాడు, మూర్ఖుడు, సంప్రదాయవాది |
| సభికులు | జూదం ఆడేవాళ్ళు | సభలోనివాళ్ళు |
| శ్రాద్ధం | శ్రద్ధగా చేసేది | చచ్చిపోయినవాళ్ళకి చేసే కర్మకాండ. |
| మంగళం | శుభం | నాశనం, నష్టం. |
| మర్యాద | హద్దు | గౌరవం |
| ఫలహారం | పండ్లతో కూడిన ఆహారం | 'టిఫిన్' (ఇడ్లీ, పిండి, దోసె మొదలగునవి) |
| ఆగ్రహం | పట్టుదల | కోపం |

| | | |
|---|---|---|
| ముహూర్తం | కాలమానం (12 క్షణాలు) | శుభ సమయం |
| అసహ్యం | సహింపలేనిది | రోత, ఏకగింపు. |

ఈ విధంగా తెలుగు మాటల్లోనే కాదు, ఇతర భాషలనుంచి తెచ్చుకున్న పదాల్లో కూడా అర్థాలు మారటం కనిపిస్తుంది. మూల భాషలోని అర్థం కాస్తా మన భాషలో మారిపోతుంది.

ఉర్దూలో గల 'అసల్' తెలుగులో అసలు అయింది. అసల్ అంటే 'మూలం' అని అర్థం. తెలుగులో వడ్డీకి ఇచ్చిన డబ్బును 'అసలు' అంటారు. (అసలీఫాయిదాలతో అని నోటు రాస్తారు. అసలిస్తావా, వడ్డీ తర్వాత చూద్దాం అనే వాడుక వుంది). యువకుడైన 'జవాన్' కాస్తా మన భాషలో 'సేవకుడు' 'నౌకరు' అయ్యాడు. (హిందీలో సైనికుడు అయ్యాడు). మనం పాకీ పనిని అసహ్యించుకుంటాం. 'పాకీవాడు' ని తక్కువగా చూస్తాం. కానీ 'పాకీ' అంటే అసలైన అర్థం పవిత్రత, శుభ్రత అని, పాకిస్తాన్, అంటే పవిత్రమైన దేశం అని అర్థం (కరుణశ్రీ ఒక పద్యంలో ప్రతి తల్లీ మన చిన్నప్పుడు పాకీదే గదా అంటారు.) పుస్తకం అనే అర్థంలో గల 'కితాబు' మనకి 'ప్రశంస' అయింది. బాకీ అంటే 'మిగిలిన' అని అర్థం - కాని తెలుగువాడి 'బాకీ' వేరు!

ఇంగ్లీషు పదాల అర్థాల్ని కూడా మార్చేస్తూంటాం. సెకండ్‌హేండ్, హేండ్ ఇచ్చాడు అన్నప్పుడు అర్థాలు వేరు. 'బిసి నాటివాడు' రా అంటే పాత కాలపువాడు, చాదస్తుడని అర్థం. 'వాడికి ఏ బి సీలు రావు' అంటే ఏమీ రాదని అర్థం గదా! ఇంగ్లీషులో 'ఓవర్‌హాల్' అంటే తనిఖీ చెయ్యటం, పరీక్షించటం అని అర్థం. 'ఆయిల్‌తో శుభ్రం చేయటం' అనే అర్థంలో దాన్ని మనం 'ఓవరాయిలింగ్' గా మార్చేసుకున్నాం.

## సంధులూ, సమాసాలూ మనం వాడుతున్నవే...

సంధులు, సమాసాలూ అంటే వ్యాకరణం అనీ, అవన్నీ పండితులకీ, కవులకీ, తెలుగు మేష్టర్లకీ అవసరమనీ భావించకూడదు. భాషలో వుండే

లక్షణాలే సంధులూ సమాసాలు. మనకి తెలీకుండానే వాటిని వాడుతూవుంటాం. వీటిని ఒక పద్ధతి ప్రకారం వాడతాం. ఆ పద్ధతిని సూత్రంలో చెప్పి వ్యాకరణం తయారు చేస్తారు అంతే! మునీంద్ర, పరోపకారం, మహర్షి, దేవాలయం, అభ్యర్థి, అత్యంత, జగద్ధితం, వాఙ్మయం, మనశ్శాంతి వంటి సంధులు సంస్కృత సంధులు. అంటే ఈ పదాలు సంస్కృతం లోంచి తెలుగు లోకి వచ్చాయి. వీటికి సవర్ణదీర్ఘ సంధి, గుణ సంధి, యణాదేశ సంధి వంటివి వర్తిస్తాయి.

చేసి + ఇచ్చెను = చేసియిచ్చెను
వారు + ఉండిరి = వారుండిరి
వాడు + చెప్పి = వాడు సెప్పి
పేద + ఆలు = పేదరాలు

ఇవి యడాగమ సంధి, ఉకార సంధి, గసడదవాదేశ సంధి, రుగాగమ సంధులకి సంబంధించినవి. వీటిని తెలుగు సంధులు అంటారు. తెలుగు మాటలకి సంస్కృత సంధులైన సవర్ణదీర్ఘ, గుణ సంధులు వర్తించవు. అంటే చేసి + ఇచ్చెను = చేసీచ్చెను అని సవర్ణదీర్ఘ సంధి రాదు. మాట్లాడే భాషకి కూడా వ్యాకరణమా? అని కొందరనుకుంటారు. ఏ భాషకైనా వ్యాకరణం సహజంగానే వుంటుంది. దాన్ని గుర్తించాలి. మనం మాట్లాడే భాషకి కూడా ఎంతో వ్యాకరణం వుంది. వాడుక భాషా వ్యాకరణం రాశారు. భాషా శాస్త్రవేత్తలు మాట్లాడే భాష గురించి ఎంతో పరిశోధన చేశారు. ప్రస్తుతానికి మనం మాట్లాడే భాషలో ఎన్ని రూపాలున్నాయో, సంధి కార్యాలున్నాయో చూడండి -

ఎత్తయిన = ఎత్తు + అయిన
ఉన్నప్పటికి = ఉన్న + అప్పటికి
ఏర్పడిన = ఏర్పడు + ఇన
వాడ్ని = వాడి + ని (వాణ్ణి)
దాక్కొను = దాగు + కొను
రాయించు = రాయ్ (రాయు) + ఇంచు

| | | |
|---|---|---|
| ఇరుగ్గది | = | ఇరుకు + గది |
| చేప్పిల్ల | = | చేప + పిల్ల |
| మా ఊ(వూ)ళ్ళో | = | మా + ఊరిలో |
| బండంతా | = | బండి + అంతా |
| పాచ్చింతకాయ | = | పాత + చింతకాయ |
| దార్లో | = | దారి + లో |

అర్థవంతమైన రెండు పదాలు కలవటమే సమాసం. తెలుగులో సమాసాలకీ సంస్కృతంలోని సమాసాలకీ తేడా వుంది. తెలుగులో సమాసంలో సామాన్యంగా రెండు పదాలకి మించి వుండవు. సంస్కృతంలో రెండు పదాలకంటె ఎక్కువ పదాలున్న సమాసాలు సహజం. ''అమందానంద కందళిత హృదయారవిందుడు'' వంటివి సంస్కృతంలో వుంటాయి. తెలుగులో 'నిండు పున్నమి చంద్రుడు' వంటివి చాలా తక్కువ. మాట నేర్పరి, ఎర్ర పువ్వు, అన్నదమ్ములు, గొప్ప మనిషి, మంచివాడు, వెన్నెల రాత్రి, పూబోడి, చలివెలుగు, రాత్రింబవళ్ళు, చెక్కుటద్దము, నల్లికుక్కలు, రెండుపదులు మొదలైన విధంగా తెలుగు సమాసాలు వుంటాయి. నావాడు, ఇంటివాడు, నిగనిగ, చిట్టచివర వంటివాటిని మన వ్యాకరణాల్లో వివరించలేదు. భాషాశాస్త్రవేత్తలు వీటిని గురించి తెలిపారు. సమాసాల విషయంలో సంస్కృత వ్యాకరణాన్ని అనుసరించటం వల్ల తెలుగు సమాసాలను మనవాళ్ళు సరిగా వివరించలేకపోయారు.

కొన్ని సమాసాల్ని వైరి సమాసాలు (హైబ్రిడ్) అన్నారు. సంస్కృతంతో తెలుగు పదం కలిపినా, సంస్కృత ప్రత్యయంతో తెలుగు పదం కలిపినా వాటిని 'మిశ్రసమాసాలు' అని అంగీకరించలేదు. ఉదాహరణకి పది అంబుజాలు అనే అర్థంలో 'అంబుజపది' అనకూడదు. అంబుజ అనేది సంస్కృతం. పది అనేది తెలుగు. అంబుజముల పది అనవచ్చు. లేదా అంబుజ దశకం అనాలి. కానీ తెలుగు కవులు దినవెచ్చం, జీవగఱ్ఱ, ప్రాణగొడ్డము, దీపకంబం, అనేకమార్లు, అల్పదండు వంటి వైరిసమాసాలు వాడారు. అపనమ్మకం,

దురలవాటు, దుస్సలహా, నిస్సిగ్గు వంటివి కూడా వ్యాకరణం ప్రకారం సరికావు. కాని భాష ముఖ్యంగా ప్రజలకోసం వుంది తప్ప వ్యాకరణం రాయడానికి కాదు. ఇవి ప్రజల వాడుకలో నిలిచి పోయాయి కాబట్టి వ్యాకరణంలో చేర్చాలి. మన భాషలో పంగనామాలు, కటిక దరిద్రుడు, కవల పుత్రులు వంటివే కాకుండా ఇటీవల మహానాడు, మహాబంపర్, అతి చౌక, రుణమేళా వంటి సమాసాలు బాగా వ్యాప్తిలోకి వచ్చాయి.

కాబట్టి సంధులు, సమాసాలు మన భాషలో తప్పకుండా వుంటాయి. మనకి తెలీకుండానే వాటిని నిత్యం వాడుతూవుంటాం.

## మాట్లాడే భాషలోకూడా అలంకారాలు!

ఉపమాలంకారం, రూపకాలంకారం, ఉత్ప్రేక్ష మొదలైనవి కవిత్వంలోనే కాదు, మనం నిత్యం మాట్లాడే భాషలోనూ వుంటాయి. బాగా, అందంగా, స్పష్టంగా హాస్యంగా, తమాషాగా చెప్పాలనుకోవటంవల్ల మనం అలంకారాలు వాడుతూవుంటాం. ఎన్నో వాక్యాల్లో చెప్పవలసిన విషయాన్ని అలంకారం ఉపయోగించి ఒకే వాక్యంలో చెప్పటానికి కూడా అలంకారం ఉపయోగపడుతుంది.

ఆ అమ్మాయి గయ్యాళి
అందర్నీ తిడుతుంది
తగాదాలు పెడుతూ వుంటుంది
సాధిస్తూ వుంటుంది

అని నాలుగు వాక్యాలు చెప్పేబదులు ' ఆ అమ్మాయి సూర్యాకాంతం' అనే అలంకారం ద్వారా చెప్పవచ్చు. సినిమాల్లో పై లక్షణాలు గల పాత్రతో పోల్చి చెప్పామన్నమాట!

'ధరలు ఆకాశాన్ని అంటుతున్నాయి', 'చుక్కల్లో ధరలు', 'మీకు అనేక వేల నమస్కారాలు , 'ఈ పూట అన్నం మేకుల్లా వుందేమిటి' వంటివి 'అతిశయోక్తి' అలంకారానికి చెందుతాయి. 'మనదేశంలో ప్రణాళికలు నత్తనడకలా సాగుతాయి.' అన్నప్పుడు ఉపమాలంకారం వుంది. 'ఆ అమ్మాయి రంభ' అంటే రూపకాలంకారం అన్నమాట! 'ఆ చప్పుడుకి

పిడుగు పడిందేమో అనుకొన్నాను' అనే వాక్యంలో ఉత్ప్రేక్షాలంకారంవుంది.

'వాడికి వెంటనే ఉద్యోగం వచ్చింది. వాడి బావగారు మంత్రిగదా' అన్నప్పుడు అర్థాంతరన్యాసం అనే అలంకారం స్ఫురిస్తుంది. 'గాంధీ వంటి నాయకుడు గాంధీయే' అన్నామనుకొండి - దానిపేరు అనన్వయాలంకారం!

'వాడు వెయిట్ తగ్గాడు'

'అసలు వాడికి వెయిట్ వుంటేగా'

ఈ వాక్యాల్లో 'వెయిట్ పదం వల్ల శ్లేషాలంకారం కనిపిస్తుంది.

'గైడ్ ఉండగా అండగా

కాలేజీకి వెళ్ళడం దండగ'

అన్నప్పుడు వృత్యనుప్రాస, అంత్యానుప్రాసలు వున్నాయి. ఇలా మనకి తెలీకుండానే మనమంతా అలంకారాలు వాడేస్తున్నాం.

## వాక్యాల్లో ఎన్ని విశేషాలో...!

మాట్లాడే భాషకి వాక్యమే ముఖ్యం. కేవలం పదాల వల్ల భావాల్ని స్పష్టంగా చెప్పలేం. సామాన్యంగా కొన్ని పదాలు కలిస్తే వాక్యం అని చెప్పొచ్చు. అయితే,

'నిన్న పుస్తకం విజయవాడ కాదు'

అన్నది వాక్యం అవుతుందా? ఇందులో కొన్ని పదాల సమూహం వుంది కదా? అయినా ఇది వాక్యం కాలేదు. ఎందువల్ల అంటే ఆ పదాలకి అన్వయం కుదరలేదు. వాటికి అర్థం పొసగదు. కాబట్టి అర్థవంతమైన పదాల (అన్వయం గల) కలయిక వాక్యం అని మామూలుగా చెప్పాలి. వాక్యాల్లో కర్త, కర్మ, క్రియ, విశేషణం, సర్వనామం, అవ్యయం, సంధి, సమాసం, ఆశ్చర్యార్థకం (ఓహో, అబ్బా), సందేహార్థకం (ఏమో, అయితే), ప్రశ్నార్థకం (ఏం, ఎందుకు) మొదలైనవి వుంటాయి. ఇవన్నీ వుండటంవల్ల వాక్యం ద్వారా మన భావాల్ని చక్కగా, స్పష్టంగా, బలంగా చెప్పడానికి వీలవుతుంది.

సామాన్యంగా తెలుగు వాక్యం 'కర్త - కర్మ - క్రియ' అనే వరసలోనే

వుంటుంది. అంటే -

'రాముడు రావణుని చంపాడు'

'వాడు విజయవాడ వెళ్ళాడు'

అనే విధంగా వాక్యం వుంటుంది. కానీ ఒక్కొక్కసారి 'భావ స్పష్టత' కోసం భావానుగుణంగా 'వాక్యంలోని పదక్రమం' కూడా మారుతుంది. అంటే -

'చదివాను మహాప్రస్థానం'

'వచ్చాడు వాడు'

'పెళ్ళి వాడుచేసుకోడు' వంటి వాటిని కూడా వాడుతూవుంటాం.

'గాలి మెల్లగా వీచెను' అనే వాక్యాన్ని ఎన్ని విధాలుగా చెప్పవచ్చో చూడండి -

1. గాలి వీచెను మెల్లగా.
2. వీచెను గాలి మెల్లగా.
3. వీచెను మెల్లగా గాలి.
4. మెల్లగా వీచెను గాలి.
5. మెల్లగా గాలి వీచెను.

రెండు వాక్యాలు కలిపి ఒకే వాక్యంగా మాట్లాడటం, రాయటం మనకి తెలిసిందే. ఈ క్రింది వాక్యాలు అటువంటివే -

'నేను వస్తానన్నాను గానీ, జ్వరం వల్ల రాలేదు'

'వాడు పిలిస్తే వచ్చేవాడెమో, నేనే తప్పు చేశాను'

'నేను సినిమాకి వెళ్తానో, పార్క్‌కి వెళ్తానో చెప్పలేను'

'నాకు గుర్తుంటూవుంటే, నీ పుస్తకం తెస్తాను'

ఒక వాక్యానికి పలికే తీరుని బట్టి వేర్వేరు అర్థాలు వస్తాయనటానికి ఉదాహరణగా ఈ వాక్యం చూడండి -

'సుబ్బారావు కాఫీ తాగి చదవలేదు'

1. సుబ్బారావు కాఫీ తాగకుండా చదివాడు.
2. సుబ్బారావు కాఫీ తాగి కూడా చదవలేదు.
3. సుబ్బారావు కాఫీ తాగి చదవలేదు, టీ తాగి చదివాడు -

అనే మూడు అర్థాలు వచ్చేలా పలకవచ్చు. వాక్యాలు పలికేటప్పుడు ఎన్నో తమాషాలు, జోకులు ఏర్పడుతూవుంటాయి.

ఉదా: {'ఏమండీ, సుబ్బారావుగారిల్లెక్కడా?'
'ఆయనకేంపని ఇల్లు ఎక్కడానికి?'}

{'ఏమిటే, అలా వంగుతున్నారు, ఆకందకా?' (ఆకు అందకా)
'అవును, ఆ కందకే' (ఆ కందకూరకే)}

{'రాజుగారు మీకు ఊరిస్తారట.' (ఊరు ఇస్తారట)
'ఆయనలాగే ఊరిస్తారు లెండి.'}

{'ఈ రోడ్డు ఎక్కడికి వెళుతుందండీ?'
'చిన్నప్పటినుంచి చూస్తున్నాను - ఎక్కడకీ వెళ్ళటం లేదు.'}

తెలుగు పదమో, ప్రత్యయమో చేర్చి దాన్ని 'తెలుగు వాక్యం' అనటం అన్యాయం. శ్రీనాథుడు సంస్కృత సమాసాల్ని తీసుకొని తెలుగు ప్రత్యయాలు చేర్చటం గమనించి, కొందరు అతన్ని 'డుమువుల కవి' అని హేళన చేశారు.

'వాడు అమందానందకందళితహృదయారవిందుడయ్యాడు' అనే వాక్యం తెలుగు వాక్యం కాదు - తెలుగు వాక్యం వంటిది! అలాగే ఈ రోజుల్లో ఇంగ్లీషు పదాలు ఎక్కువగా వాడుతూ - 'నేను స్టూడెంట్‌గా వున్నప్పుడు ఒబీడియంట్‌గా వుండి కాంపిటీషన్లలో పార్టిసిపేట్ చేసి ప్రైజులు తెచ్చాను.' అనటం (రాయటం కూడా) ఎక్కువైంది. తెలుగులో వాక్యాలు రాయటం క్రమంగా తగ్గిపోతుందేమోననే భయం కూడా వేస్తోంది. సంస్కృతం, హిందీ, ఇంగ్లీషు వంటి భాషల్లో వాక్యాలు ఎక్కడ దేవతలు పూజింపబడతారో అక్కడ, ఎవరైతే వెళ్తారో, ఏదైతే ఎట్టిగా వుందో, ఎప్పుడైతే అతను వచ్చాడో అనే విధంగా ప్రారంభం కావటం సహజం. 'ఎవరికైతే నాలుగు చేతులు వున్నాయో, ఎవరు లక్ష్మీ దేవికి భర్తో, ఎవరు భక్తుల పాలిట కల్పతరువో అటువంటి విష్ణువుకి నమస్కారం' అనే వాక్యం సంస్కృతంలో వుంటుంది తప్ప తెలుగులో కృత్రిమంగా వుంటుంది. తెలుగు పద్యాల్లో 'ఎవ్వనిచే జనించు జగ మెవ్వని లోపలనుండు...' వంటివి

లేకపోలేదు. కాని మాట్లాడేటప్పుడు సహజంగా కనిపించదు. ఇటీవల ఇంగ్లీషు, హిందీ భాషల ప్రభావం వల్ల

'ఎక్కడ లైఫ్‌బోయ్ వుందో అక్కడ ఆరోగ్యంవుంది.'

వంటివి తెలుగులోకి ప్రవేశించాయి. అయితే ఇటువంటి వాక్యాలు తెలుగులో అప్పుడప్పుడు చాలా తక్కువగా ఉపయోగించటం లేకపోలేదన్న విషయం ఈ క్రింది వాక్యాల వల్ల తెలుస్తోంది -

'ఎవడు చేసుకున్నంత వాడనుభవిస్తాడు'

'వాడు ఎప్పుడైతే వెళ్ళిపోయాడో ఇలా అవుతుందని అప్పుడే అనుకున్నాను'

'ఎప్పుడు రమ్మంటే అప్పుడు వస్తాడు.'

'ఎవరైతే దీని వెనకాల వున్నారో వాళ్ళే చేసారు.'

'ఎప్పుడు ఏది చెయ్యాలో అది అప్పుడు చేస్తేనే అందం.'

'ఎంత త్వరగా అయితే అంత మంచిది.'

తెలుగులో ఇలా ఎన్నో రకాల వాక్యాల్ని వాడుతూ వుంటాం. ఉదాహరణకి ఈ క్రింది వాక్యాల్ని పరిశీలించండి -

1. నేను సినిమాకి వెళ్ళలేదు.
2. నువ్వు తప్పకుండా రావాలి.
3. నువ్వు పరీక్ష రాశావా?
4. ఆహా, ఎంత బావుంది!
5. నీకు శుభం కలగాలి!
6. వాడు చదువుతాడో చదవడో!
7. నేను భోంచేసి, సినిమాకి వెళ్ళి, అక్కడినుంచి లైబ్రరీకి వెళ్ళాను.
8. అది ఎరుపు. వీడు నలుపు.
9. వాడు <u>చూసిచూసి</u> వెళ్ళిపోయాడు.
10. బాగా చదవకపోవటం <u>వల్ల</u> తప్పాడు.
11. అతను నిన్ను రేపు వెళ్ళమని చెప్పమన్నాడు.

12. డబ్బులుంటేనా, ఎప్పుడో కొనేవాణ్ని.
13. వాడు వస్తాడేమో కనుక్కోవాలి.
14. వాడు ధామ్మని పడ్డాడు.
15. నువ్వెలా మాట్లాడతావో నాకు తెలీదా!
16. ఇది వాడిచ్చిన పుస్తకం.
17. మీరు పాడటం ఏమిటి?
18. ఎవరి వూళ్ళో వాళ్ళుండిపోయారు.
19. ఆవిడ కూరగాయలూ అవీ తేగలదా?
20. నువ్వు అన్నం తింటే, జ్వరం వస్తుంది.
21. నాది అనేది ఏమీ లేదు.
22. డాక్టరు మందు ఇచ్చినా, బతకలేదు.
23. ఆమె నిద్రపోతున్నట్టుగా వుంది.
24. మీరు గాని, నేను గాని వెళ్ళాలి.
25. కమల అందమైనదీ, తెలివైనదీ.

మరో విశేషం ఏమిటంటే తెలుగు వాక్యాల్లో తరచుగా 'బడు', 'జరుగు'లను వాడటం.

'ఆపని చెయ్యటం జరిగింది.'
'వాళ్ళకి చెప్పటం జరిగింది.'
'ఇక్కడ అమ్మబడును.'
'తిరిగి తీసుకొనబడవు.'
'జరిమానా విధించబడును.'

ఇవి తెలుగు భాషకి సహజం కాకపోయానా అందరికీ ఆమోదయోగ్యమయ్యే విధంగా వాడుకలోకి వచ్చేశాయి. రాసేటప్పుడు మాత్రమే కాకుండా మాట్లాడేటప్పుడు కూడా ఈ రకమైన వాక్యాలు 'మామూలు' అయ్యాయి. మరోరకమైన వాక్యాలు చూడండి -

'వాళ్ళు రోడ్డు మీద బైఠాయించారు.'
'అది పుచ్చుకొని వాళ్ళు ఉడాయించారు.'

'నామీద అనవసరంగా కేసు బనాయించారు.'

ఈ వాక్యాల్లో 'ఇంచు' ని గమనించండి. ఇది తెలుగు క్రియలకే రావాలి - వండించు, పొడిగించు లాగా. అయితే ఇతర భాషా పదాలకి కూడా 'ఇంచు' చేర్చటం మొదలుపెట్టాం. ఆ విధంగా, హిందీ పదాలకి 'ఇంచు' చేర్చటం వల్ల 'బైతాయించు', 'ఉడాయించు', 'బనాయించు', వంటివి ఏర్పడ్డాయి. ఆరుద్ర తన కవిత్వంలో ఇంగ్లీషు పదాలకి కూడా ఇంచు చేర్చి 'పెరిషించు', 'చెరిషించు', అని కూడా వాడారు, 'ఇంచు' లాగా మిగిలిన క్రియల్ని కూడా చేర్చటం అలవాటైపోయింది. 'మీల్స్‌చేయు', 'ఫోన్‌చేయు', 'ఖుషీచేయు', 'గేమాడు', 'వాక్‌చేశావా' వంటి వాటితోపాటు తమాషాగా 'నిన్ను కాలుస్తున్నాడు' (నిన్ను పిలుస్తున్నాడు), 'వాడు వాకడు, రన్నడు' (వాడు నడవడు, పరుగెత్తడు), వంటి ప్రయోగాలు కొందరు చేస్తూవుంటారు.

## పదాలలో చిత్రవిచిత్రాలు!

తెలుగు పదాల్లో చిత్రవిచిత్రాలు కనిపిస్తాయి. కొన్ని పదాలు ప్రత్యయాల కలయిక వల్ల మారిపోతూవుంటాయి. కలుగు + ఇమి - కలిమి అవుతుంది. అలాగే ఓరిమి అనేది 'ఓరుచు + ఇమి' వల్ల ఏర్పడుతుంది. 'చేయు + త' - 'చేత' అవుతుంది. వలపు కావాలంటే 'వలచు' కి 'పు' కలపాలి. 'కాచు + వలి' - కావలి అవుతుంది. ఇటు వంటివి మరికొన్ని -

వ్రేయు + టు = వ్రేటు
జాలము + అరి = జాలరి
పుజ + అరి = పూజారి
ముక్కు + ఇడి = ముక్కిడి (ముక్కు లేని వాడు)

వేరు వేరు అర్థాలున్న పదాలు కలిసిపోయి ఒకే పదంగా మారి కొత్త అర్థాన్నివ్వడం మరో విచిత్రం

అందు, కొను = అందుకొను
తల. పోయు = తలపోయు

తెల్ల, పోవు = తెల్లబోవు

అడుగు, కొను = అడుక్కొను

వీటిని వ్యాకరణంలో 'శబ్ద పల్లవాలు' అన్నారు. ఒకే పదం రెండుసార్లు రావటం వల్ల అర్థంమారిపోవడం మరో విశేషం.

ఇల్లు + ఇల్లు = ఇల్లిల్లు (ప్రతిఇల్లు)

ఊరు + ఊరు = ఊరూరు (ప్రతిఊరు)

చూసి చూసి వెళ్ళాడు (చాలాసేపు చూసి అనే అర్థం).

చెప్పి చెప్పి విసుగొత్తింది.

అప్పుడప్పుడు వెళ్తాను.

ఇంతింత కళ్ళున్నాయి..

కొన్ని పదాలు జంటగానే వాడబడుతూ వుంటాయి. ఈ జంట పదాల్లో కొన్నిటికి అర్థాలుంటాయి - మరి కొన్నిటికి అర్థాలుండవు. అయితే భావం వ్యక్తికరించటంలో ఇవి తోడ్పడతాయి.

పిల్లాజెల్లా, ఇల్లూగిల్లూ, డబ్బూగిబ్బూ వంటి పదాల్లో రెండోపదానికి ప్రత్యేకమైన అర్థం వుండదు. కాని జంటగా వాడటంవల్ల భావానికి బలం చేకూరుతుంది. చూడండి

'మీ అబ్బాయికేమైనా పిల్లలా?'

'పిల్లా జెల్లా ఏమీ లేరు.'

'పిల్లలు లేరు, పిల్లలు పుట్టలేదు' అనేకంటె - ఆ అసంతృప్తిని 'పిల్లాజెల్లా' వల్ల బాగా వ్యక్తీకరించవచ్చు.

'రాముడా, గీముడా?'

'బడీ లేదు గిడీ లేదు'

వంటి జంటపదాలు వ్యతిరేకార్థంలో లేదా నిందార్థంలో వస్తాయి. ఉచ్చారణ సామ్యంతో ఏర్పడే - అప్పూసాప్పూ, అజాపజా, వేళాపాళా, అతీగతీ -వంటి జంటపదాలతోపాటు ఇంచుమించుగా ఒకే అర్థం గల జంటపదాలు కూడా వున్నాయి. ఉదాహరణకి - అదురుబెదురు; ఈడూజోడూ, ఇంపుసొంపు.

'ఊరూ పేరూ' లేనివాళ్ళు) - అన్నప్పుడు అనామకులనే అర్థం వస్తుంది. 'ఆట పాటలే కాదు చదువూ వుండాలి' లో 'ఆటపాట' వుందిగదా - ఆట ఆడేటప్పుడు పాట పాడటం మనకి తెలిసిందే - అందువల్ల 'ఆటా పాటా' అనేది వచ్చివుంటుంది. 'పెట్టె బేడా సర్దుకో' - ఈ వాక్యంలో 'పెట్టె - బేడా' వుంది. ఏవూరు వెళ్ళాలన్నా బట్టలకి పెట్టి కావాలి, చార్జీలకి 'బేడ' (పావలాలో సగం) - డబ్బుండాలి. అందుకే 'పెట్టి బేడా' అన్నారు.

ఈ క్రింది జంటపదాల్ని కూడా మనం అనేక సందర్భాలలో వాడుతూవుంటాం

-రాయి - రప్పా; ఉద్యోగం - సద్యోగం; కూలి - నాలి

పనీ - పాటా; పురుగూ - పుట్రా; తోడూ - నీడా

చీకూ - చింతా; తిండీ - తిప్పలు; మందూ - మాకూ

మనం బండి 'ఱ' - ఱ, అరసున్న 'ఁ', లు అనవసరం అనుకుంటాం. ఇప్పుడవి ఎవరూ వాడటంలేదు కూడా. కానీ భాషలో వీటికి ఎంతో ప్రాముఖ్యం వుంది. కావ్య భాషని అర్థం చేసుకావాలన్నా, విశ్లేషించాలన్నా వీటిని గురించి తెలుసు కోవాలి. ఒకనాడు ప్రాధాన్యం వున్నవి - మరోనాడు గుర్తింపు లేకుండా పోవటం అనేది భాషలో సహజమే.

కారు (కాలం, ఋతువు, నలుపు)

కాఱు (కారటం - నీళ్ళు కారటం)

ఈ రెండిటికీ అర్థంలో భేదం గమనించండి. అంటే 'బండిర' (శకట రేఫ) వల్ల అర్థం మారింది. ఇటువంటివే మరికొన్ని -

అరుగు (పోవుట) అఱుగు (జీర్ణించు)

నీరు (నీరు) నీఱు (బూడిద)

వేరు (చెట్టువేరు) వేఱు (మరొక)

కొన్ని పదాల్లో అరసున్న ఉండటంవల్ల అర్థంలో తేడా వచ్చేస్తుంది. అరసున్న లేని 'ఏడు' అంటే సంఖ్య లేదా ఏడుపు. అరసున్న వుంటే - 'ఏఁడు' కి సంవత్సరం అని అర్థం. ఈ క్రింది వాటిని గమనించండి -

దాఁక = వరకు (అందాక).
దాక = పాత్ర (కుండ).
కాఁచు = కాపాడటం.
నాఁడు = కాలం, రోజు.
నాడు = దేశం, ప్రాంతం.

ఒకేపదం తెలుగులోను, సంస్కృతంలోను వుంటుంది. కానీ అర్థాలు వేరు. 'చారు' - సంస్కృతంలో అందమైన అని అర్థం. తెలుగులో, భోజనంలో చారు (రసం). తెలుగులో 'నామం' అంటే బొట్టు. సంస్కృతంలో 'నామం' అంటే పేరు. ఇలాగే తెలుగులో ఉపన్యాసం అంటే తెలుసు మనకి. మరి హిందీలో ఉపన్యాస్ అంటే 'నవల.'!

ఈ క్రింది వాక్యాలు చూడండి -

'బుడుంగు మని మునిగాడు'
'ధామ్మని పడ్డాడు'
'చెంప ఛెళ్ మంటుంది'
'ధగ ధగ మెరుస్తోంది'
'పక పక నవ్వాడు'

-వీటిల్లో ముందున్న పదాల్ని ధ్వన్యనుకరణ శబ్దాలు అంటారు. పడినప్పుడు నిజంగా 'ధాం' అనే శబ్దం రాకపోవచ్చు. కానీ అలా చెప్పినప్పుడే 'పడటం' గురించి బాగా చెప్పగలం. బాగా కొట్టాడు అనే భావాన్ని చెప్పటానికి 'ఛెళ్' అనే శబ్దం వాడతాం. 'మెరవటం' గురించి చెప్పేటప్పుడు 'ధగ ధగ' అనే కాదు - తళ తళలాడుతోంది' అనీ వాడతాం. పళ్ళు కొరకటాన్ని ''పటపట'' అనే పదంతో చెప్తాం. ఇలాగే భగభగమండవచ్చు. నిగనిగలూ ఉండవచ్చు. బరబరా ఈడ్చుకుపోవచ్చు. కరకర నమలనూవచ్చు. భౌ భౌలూ, ఘీంకారాల, కావు కావులు, కుహూ కుహూలు కూడా వాటి అరుపుల్ని అనుకరించే శబ్దాలే!

చిన్న పిల్లలు వాడే పదాలు, వాళ్ళకోసం పెద్దవాళ్ళు వాడే పదాలు పరిశీలిస్తే మరికొన్ని విశేషాలు తెలుసుకోవచ్చు. మనం ''అన్నంతినరా''

అనకుండా ఆం తినరా' అంటాం. 'లాల పోసుకుంటావా' అంటే నీళ్ళు పోసుకుంటావా అని అర్థం. చిన్న పిల్లలు నీళ్ళు తాగరు - 'బొబ్బ' తాగుతారు. 'షికారు' కి పిల్లల భాషలో ఆచి వెళ్దాం'! పిల్లలకోసం పెద్దలు తప్పులు పలుకుతూ కాలు ఎక్కుదామే (కారు), ఓలురా ( ఎవర్రా), బబ్బోరా (పడుకోరా), అప్పచ్చి, మాయ్య (మామయ్య) వంటివి పలకటం గమనించవచ్చు.

## ఉచ్చారణలోనూ గమ్మత్తులున్నాయి

మనం అందరం ఒకే విధంగా మాట్లాడం అలాగే ఒక మాటని వివిధ సందర్భాల్లో వేర్వేరుగా పలుకుతాం. ఈ 'స్వరభేదం' గమనించవలసిందే. కోపంలో ఒక విధంగా, వేళాకోళంలో మరో విధంగా, భయంలో వేరొక విధంగా, విచారంలో ఇంకో విధంగా, శాంతంగా ఉన్నప్పుడు మరొక విధంగా మన ఉచ్చారణ వుంటుంది. ఈ ఉచ్చారణవల్ల 'ఊనిక', 'స్వరభేదం' ఏర్పడతాయి. భావానుగుణంగా ఉచ్చరించటం వల్ల, నొక్కి పలకడం వల్ల అర్థాలు కూడా మారిపోతూవుంటాయి.

'మంచివాడు' అనకుండా కొందరు 'మాంచివాడు' అని సాగదీస్తారు. ఇంకొందరు 'మంఛివాడు' అని నొక్కి పలుకుతారు. ఇలా నొక్కి పలకటంవల్ల ఒక్కోసారి అర్థంకూడా మారుతుందని అందరూ చెప్పే ఉదాహరణ ఇది -

'రెండెడ్ల బండ్లు'

పలకటాన్ని బట్టి రెండర్థాలు వస్తాయి. 1. రెండు ఎడ్లు గల బండ్లు. 2. రెండు ఎడ్లబండ్లు అనే అర్థాలు వస్తాయి. ఇలాగే -

'వాడొచ్చాడా?'

అనేది పలకటాన్ని బట్టి చాలా అర్థాలు ఇస్తుంది. ఒక విధంగా పలికితే మామూలుగా 'ఆ ఫలానావ్యక్తి వచ్చాడా' అని అర్థం. మరోవిధంగా పలికితే 'ఎవరో వస్తారనుకొంటే వాడు వచ్చాడా అని అర్థం ఇంకొవిధంగా పలికితే 'చచ్చాం, వాడొచ్చాడా' అనే ఆశ్చర్యం కలగవచ్చు. అంతదాకా ఎందుకు - 'ఆఁ' అనేదాన్ని మనం అనేక భావాలలో అనేక రకాలుగా పలకవచ్చు. మనం పలికే పద్ధతిని బట్టి అది ఆశ్చర్యం కావచ్చు. ప్రశ్న కావచ్చు. జవాబు

కావచ్చు. 'సరేలే' అనే నిర్లక్ష్యం కావచ్చు.

## కులాన్ని, వృత్తిని బట్టి పదాలూ, అర్థాలూ!

మన సమాజంలో అనేక కులాలూ, వృత్తులూ వున్నాయి. ఒక్కొక్క కులానికీ, వృత్తికీ ఒక ప్రత్యేక జీవన విధానం వుంటుంది. అందువల్ల ప్రత్యేకమైన పదాలు వాడటం, కొన్ని పదాల్ని ప్రత్యేక అర్థంలో వాడటం గమనించవచ్చు. బ్రాహ్మణుల భాష వేరు, కోమట్ల భాష వేరు. వెలమ కులస్థుల భాష మరొకలా వుంటుంది. కుమ్మరి, వడ్రంగి, బెస్త, చర్మకారులు, స్వర్ణకారులు మొదలైన వృత్తి పనివాళ్ళ భాషలో ప్రత్యేకతలుంటాయి. ఈనాడు లెక్చరర్, బ్యాంకు ఉద్యోగి, జ్యోతిషం, వాస్తు మొదలైన రంగాలలోని వ్యక్తుల భాషలో భేదాలు పరిశీలించవచ్చు. 'అవునేషే, మనవిస్సావజ్ఝలవారి అమ్మాయిషే, అవధాని గారి అబ్బాయికిస్తారుషే' అని ఒకనాడు బ్రాహ్మణులు మాట్లాడేవారట. వేదంలో 'వయందేవస్య భోజనమ్' అని వుంది. 'భోజనం ఎక్కడ' అని దాని అర్థం. అయితే బ్రాహ్మణులు (పురోహితులు) 'వయందేవస్య ఎక్కడ' అని వాడుతూ వుంటారు. వీళ్ళ దృష్టిలో 'భోక్తలు' అంటే తద్దిన భోజనం చేసేవారు. వాళ్ళేమన్నా ఇచ్చారా? అంటే ఇవ్వలేదు అనటానికి 'ఏమిటి ఇచ్చేది బభ్రాజమానం' అంటారు. 'శతమానం భవతి' అంటే తిట్లు. 'నకారగుడిగాడు' - అంటే నియోగి అని అర్థం. అలాగే పురోహితుల తిట్లలో 'అప్రాచ్యపు వెధవ', 'త్రాష్టుడా', 'శుంఠ' వంటి పదాలు చోటు చేసుకుంటాయి.

వివిధ కుల, వృత్తుల వాళ్ళు ఎలా మాట్లాడతారో, ఏ పదాలు వాడతారో సేకరించి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ కొన్ని 'వృత్తి పద కోశాలు' ప్రచురించింది. నేటి దళిత సాహిత్యాన్ని - ముఖ్యంగా కవిత్వాన్ని పరిశీలిస్తే దళితుల భాషని తెలుసు కోవచ్చు. అలాగే ఉర్దూ ప్రభావం గల వాళ్ళ తెలుగు మనకి తెలిసిందే గదా!

'అమ్మో్మ యమ్మ! శెయిసూపు, సెయిసూపవేదుండి! దనముగల సెయ్యే. దాన్యము గల సెయ్యే. బంగారు సెయ్యే. అటుయిటు సూడక

నే సెప్పేది గురివూంకొని వినవేదుండి. కంట్లంటే తోడు. కడుపంటే కొడుకు. కంటింటే మగండు' -ఇది 'ఎఱుకత' భాష. (సోది చెప్పేవాళ్ళ భాష).

'వొరెవొరె ఆ బాపనోణ్ణి విడిస్తి వేందిరా? మనవాండ్లని కోనెలకు రానివ్వడేందిరా వోయి లొగండి. అల్లా బాపన వాంణ్ణి తోయరా - మనమాట ఇనుకొంటాడా లేదా అడుగుంద్రి, ఏంది సూత్తడు? ఏంది సెప్తడు ' - ఇది బలహీన వర్గాల వాళ్ళ ఒకరకమైన భాష.

విద్యార్థులు ఒక కులానికి, వృత్తికి సంబంధించినవారు కాకపోయినా వాళ్ళ భాషకి కూడా ప్రత్యేకత వుంది. 'కలర్ లేదు', 'ట్యూబులైట్‌గాడు', 'లైను వేశాను , హేమరింగ్' 'వైటవుట్ , వంటి మాటల్ని విద్యార్థులు వేరే అర్థాల్లో వాడుతూ వుంటారు. ఇటీవల ఇతర వృత్తుల, రంగాల వాళ్ళ మాటలు విపరీతమైన విశాలమైన అర్థాల్లో అందరూ వాడుతున్నారు. అటువంటి వాటిల్లో కొన్ని - బైండోవర్, ఎగస్ట్రార్డీ, డెబిట్-క్రెడిట్, బడ్జెట్, కేటలిస్ట్, క్లీన్ బౌల్డ్, లంబకోణం, రన్ అవుట్, వికెట్ పడిపోయింది ఎట్ల త్రికోణం, సెంటరు (చూసికొట్టాలి), థర్డ్ ఎంపైర్ మొదలైనవి.

మనలో చాలామంది కొన్నా పదాల్ని అవసరం లేకున్నా పదే పదే వాడుతుంటాం. ఆ పదాలకి ఆ సందర్భంలో ప్రత్యేక అర్థం ఎమీ ఉండదు. వాటిని 'ఊత పదాలు' అంటారు. ఆ పదాలు లేకుండా మాట్లాడమంటే ఇబ్బంది పడతారు. తెలుగే కాదు ఇతర భాషలు మాట్లాడే వాళ్ళకి కూడా 'ఊత పదాలు' వుంటాయి. రాజకీయ నాయకులు ఊత పదాల్ని ఎక్కువగా వాడుతుంటారు. అసలు, అంతే కాదు, చెప్పొచ్చేది ఏంటంటే, మీకు తెలుసు, మనవి చేసుకుంటున్నాను, మరి అట్లాగే, అవును గాని, ఏడిశావ్, ఏమంటే, తెలీకడుగుతాను, బాగుంది, మంచిది వంటివి చాలా ఊత పదాలన్నాయి. ఒక్కొక్క వ్యక్తికి ఒక్కో ఊత పదం వుంటుంది. కొందరికి బూతుపదాలు ఊత పదాలుగా వుంటాయి. ఇటీవల ఇంగ్లీషు, హిందీ భాషల ప్రభావంతో ఐసీ ఎస్, ఎనీహౌ, అఫ్‌కోర్స్, యా, అచ్ఛా క్యాజీ వంటివి వాడటం గమనిస్తాం. ఊత పదాల వల్ల ఒక్కొక్క సారి అపార్థం, ఎగతాళి వంటివి జరగవచ్చు. మిమిక్రీలో సరదాగా చెప్పే జోక్ ఒకటి వుంది -

'ఏమయ్యా, కనిపించడంలేదు '

'హైదరాబాదు వెళ్ళాను.'

'మంచిది. ఎందుకు వెళ్ళావు?'

మా తమ్ముడు చనిపోతేనూ.'

'మంచిది, అయ్యో అలాగా.

**సామెతలూ...జాతీయాలూ!**

ప్రతి భాషకీ సహజమైన, సొంత జాతీయాలూ, సామెతలూ వుంటాయి. భాషా వ్యవహారానికి ఇవి ఆయువు పట్టులని చెప్పవచ్చు. సామెతల ద్వారా, జాతీయాల ద్వారా మన భావాల్ని స్పష్టంగా, అందంగా, సంక్షిప్తంగా గుండెకు హత్తుకొనేలా చెప్పవచ్చు. చమత్కారంగా చెప్పడానికి, ఆకర్షణీయంగా చెప్పడానికి ఇవి సహకరిస్తాయి. ఈ సామెతలు, జాతీయాలు ఆయా జాతుల కులాల సంస్కృతీ సంప్రదాయాల వల్ల ఆచారాల వల్ల ఏర్పడుతూ వుంటాయి జీవన విధానాన్ని ఇవి సూచిస్తాయి. వీటిల్లో మానవ స్వభావ చిత్రణ వుంటుంది. లోకజ్ఞత వుంటుంది హెచ్చరిక వుంటుంది. సలహా వుంటుంది హాస్యం వుంటుంది. నలుగుర్నీ ఆకట్టుకోవటానికి, ఉపన్యాసాలకీ వీటి అవసరం వుంటుంది

సామెతలూ జాతీయాలూ దాదాపుగా ఒకటే అనిపిస్తాయి కానీ కొంచెం భేదం లేకపోలేదు. జాతీయాలు సామాన్యంగా చిన్నవిగా (పదబంధాలుగా) వుంటాయి. సామెతలు పెద్దవిగా (వాక్యాలుగా) వుంటాయి. రెండు వాక్యాలు కూడా సామెత కావచ్చు. సామెతలు తరతరాలుగా ప్రజల్లో వ్యాపిస్తూ వస్తాయి. జాతీయాలు కూడా అనాదిగా వున్నా అవి మార్పులకి, చేర్పులకి గురవుతూ వుంటాయి జాతీయానికి అసలైన అర్థం కాకుండా సందర్భాన్ని బట్టి మరో అర్థం వస్తుంది. ఆలంకారికత జాతీయాలలో ఎక్కువ. ఉదాహరణకి 'కడుపులో చల్ల కదలకుండ' అనే జాతీయం చూడండి. కడుపులో నిజంగా చల్ల ఉందనీ, అది కదలకుండా ఉందనీ అర్థం కాదు. ఆ అర్థం నుంచి 'శ్రమ పడకుండా వుండే బుద్ధి' అనే అర్థం పుడుతుంది.

తెలుగులో వేల సామెతలు, జాతీయాలూ వున్నాయి. సేకరించవలసినవి

ఇంకా ఎన్నో వుంటాయి. ప్రాంతాన్నిబట్టి కూడా వేర్వేరు సామెతలుంటాయి. కొన్ని సామెతలు వైరుధ్యంతో వుంటాయి. అయితే వాటిని ఆయా సందర్భాలకి అనుగుణంగా అన్వయించుకోవాలి. సంస్కృతం నుంచి కూడా కొన్ని సామెతలూ, జాతీయాలూ' తెలుగు లోకి వచ్చాయి. కొన్ని సామెతల్లో ఈ నాటి భావాలకి అన్వయించనివి, అశాస్త్రీయమైనవి లేకపోలేదు వాటిని చారిత్రకంగా అవగాహన చేసుకోవాలి.

ముందుగా కొన్ని జాతీయాలను తెలుసుకుందాం

### అగస్త్యభ్రాత

వాడు వట్టి అగస్త్య భ్రాతరా' అంటారు. ఇది సంస్కృతంలోంచి వచ్చిందే ఈ మాటకి 'అగస్త్యమహర్షి సోదరుడు' అని అర్థం. అసలు అగస్త్యుని సోదరుడికి పేరు లేదు. అతని గురించి అంతగా తెలీదు. కాబట్టి ఊరూ పేరు లేనివాడిని 'అగస్త్యభ్రాత' అంటారు.

### ఆకాశ రామన్న

ఆకాశ రామన్నలూ, ఆకాశ రామన్న ఉత్తరాలూ మనకి బాగా తెలుసు. ఇంతకీ ఎవరీ 'ఆకాశరామన్న?' ఇది మనిషి పేరు కానేకాదు. సంస్కృతంలో, 'ఆకాశనామ్నా' అంటే ఆకాశం అనే పేరు గల' అని అర్థం. ఆకాశం అంటే శూన్యం. కాబట్టి శూన్యం అనే పేరుగల - ఏ పేరూ లేని అని అర్థం. కాబట్టి ఊరూపేరు లేకుండా, ఎవరు రాశారో తెలీని ఉత్తరాన్ని ఆకాశరామన్న ఉత్తరం అంటున్నాం. 'ఆకాశనామ్నా అనేది ఆకాశ రామన్న అయిందని చెప్తారు

### అందెవేసిన చెయ్యి

ప్రజ్ఞావంతుడు, గొప్ప నేర్పు గలవాడు అనే అర్థంలో దీన్ని వాడుతూ వుంటాం. 'బాలమురళీకృష్ణ సంగీతంలో అందెవేసిన చెయ్యి' అనవచ్చు. పూర్వకాలంలో ఒక విద్యలో గొప్ప పాండిత్యం సంపాదిస్తే - అతనికి పరీక్ష పెట్టి - నెగ్గగానే సభలో సన్మానం చేసి చేతికి అందె (కంకణం) వేసేవారు. అంటే అతని అర్హతకి 'టెస్ట్' పెట్టి - ఒక సర్టిఫికేట్‌లాగా 'అందె' తొడిగేవారన్నమాట।

కూపస్థ మండూకం (నూతిలో కప్ప), స్వస్తి, శఠగోపం, కరతలామలకం, అస్ఖలిత బ్రహ్మచారి, ఆకాశ పంచాంగం, అజాగళస్తనం, హస్తి మశకాంతరం వంటివి సంస్కృతం నుంచి వచ్చిన జాతీయాలు. ఒక తాటి పండుపై కాకి వాలింది. వెంటనే తాటి పండు క్రింద పడింది. అనుకోకుండా ఒకే కాలంలో జరిగిన ఈ సంఘటన ఆధారంగా 'కాకతాళీయం' పుట్టింది. 'ఉత్సవ విగ్రహం' ఎలా వచ్చిందో చూడండి - దేవాలయాల్లో అసలు విగ్రహం వేరు - అది మూలవిరాట్టు విగ్రహం. పండుగలలో, ఉత్సవాలలో ఆ మూలవిరాట్టుకి బదులుగా మరో విగ్రహాన్ని ఊరేగిస్తారు. ఈ మరో విగ్రహానికి ఉత్తప్పుడు పనీపాటా వుండదు. ఎవరూ దాన్ని పట్టించుకోరు. పూజచేయరు. అందుకని పనిపాటాలేని వాడ్ని 'ఉత్సవవిగ్రహం'-వాడెందుకు?' అంటారు. వృష్టి అంటే వర్షం ఎక్కువ వర్షిస్తే అతివృష్టి అవుతుంది. అసలు వర్షించకపోతే అనావృష్టి అవుతుంది. రెండూ నష్టమే. ఆ వర్షాన్ని ఇతర పనులకి అన్వయిస్తూ 'అతివృష్టి- అనావృష్టి' అనే జాతీయం ఏర్పడింది. 'ద్రావిడ ప్రాణాయామం' అనే జాతీయంవుంది కదా! తలచుట్టూ తిప్పి చేతితో ముక్కుపట్టుకొనే ప్రక్రియ పేరు ద్రావిడ ప్రాణాయామం. సరాసరి పట్టుకోవచ్చు గదా! అనిపిస్తుంది మనకి. కాబట్టి మామూలుగా చేసే పనిని శ్రమపడి మరోవిధంగా చెయ్యటం ఎందుకు, దండగ - అనే భావంతో 'ద్రావిడ ప్రాణాయామం' వాడుతున్నాం.

'అసిధారా వ్రతం' అనే జాతీయం ఎలా వచ్చిందో చూడండి - భార్యాభర్తలు బ్రహ్మచర్యం అవలంబించవలసివచ్చింది. నిగ్రహం వుండాలి. చాలా కష్టం ఒకేశయ్యపై పడుకొన్నా కలవ కూడదు. ఇదొక కఠినమైన వ్రతం. దీన్ని ఆచరించాలి అంటే వాళ్ళిద్దరు కలవకుండా మధ్యన పదునైన కత్తివుంచారట. అది అసిధారా వ్రతం అయిందని చెప్తారు.

ఒక ఎద్దును ఈశ్వరుని వాహనంగా భావించి, ఏ పనిని చేయించకుండా - అచ్చుపోసి (ముద్రవేసి) విడిచిపెడతారు. అది కట్టుబాటు లేకుండా స్వేచ్ఛగా తిరుగుతుంది. దాన్ని ఎవ్వరూ కొట్టరు. అదిలించరు. దాన్ని 'అచ్చోసిన ఆంబోతు అంటారు. కాబట్టి స్వేచ్ఛగా లేక రికామిగా, బాధ్యత లేకుండా తిరిగేవాడు అచ్చోసిన ఆంబోతు అయిపోయాడు.

అండదండలు, ఆటుపోటు, ఆనుపానులు, ఏకుమేకు వంటి జంటపదాలు గలవి, టాటాలు గుణించు, పేకులాట పంచాంగం, పైలాపచ్చీసు వంటి వింత జాతీయాలు కూడా వున్నాయి. అందరూ వాడే 'తు.చ. తప్పకుండా' అనే జాతీయం వుంది. సంస్కృతంలో తు, చ అనే ప్రత్యయాలున్నాయి. ఇవి ఛందస్సు కోసం ప్రత్యేక అర్థం లేకపోయినా, ఉపయోగం లేకపోయినా వాడుతూవుంటారు. అంటే నిరర్థకాలైన, నిరుపయోగమైన అక్షరాలుగా తు.చ లనువాడుతూవుంటారు. కాబట్టి అటువంటి అవసరం లేనివాటిని కూడా విడువకుండా అనే అర్థంలో, ఆజ్ఞ పాటించేవాడుగా - చెప్పింది యథాతథంగా చేసేవాడుగా 'వాడు తు.చ.తప్పకుండా చేస్తాడు' అనే వాడుక వచ్చింది.

రామాయణ, భారత భాగవతాదులలోని కథలవల్ల కొన్ని జాతీయాలు ఏర్పడ్డాయి. శల్య సారధ్యం, కుంభకర్ణుని నిద్ర, ఊర్మిళాదేవి నిద్ర, అక్షయ పాత్ర, త్రిశంకు స్వర్గం, సుందోపసుందులు, యక్ష ప్రశ్నలు, వాతాపి జీర్ణం వంటివి అటువంటివే. సాంఘిక పరంగా అంతా మన మేలుకే, గుడిపూడి జంగాలు, చేతిచమురు భాగోతం, తుని తగవు, దొందూ దొందే, మేకపోతు గాంభీర్యం, రెంటికి చెడిన రేవడు వంటి జాతీయాలు ఏర్పడ్డాయి. ఈ జాతీయాల వెనక కథలున్నట్టుగా కొందరు వివరించారు. ''రెంటికి చెడిన రేవడు'' అనే జాతీయానికి గల కథ ఇది- రేవడు అంటే చాకలివాడు.

ఒక చాకలి రోజూ ఏటికి వెళ్ళి బట్టలు ఉతుక్కుంటూ వుంటాడు. ఒక రోజు బట్టలుతుకుతూంటే పెద్ద గాలీ వాన వచ్చి ఏరు పొంగి ప్రవహిస్తోంది. ఒడ్డున వున్న బట్టలు కొట్టుకుపోతుంటే చాకలి చేతిలో వున్న బట్టల్ని అక్కడే వదిలేసి ఆ బట్టలకోసం పరుగెత్తాడు. కానీ ఆ గాలి వేగంలో అతనికి అవి దొరకలేదు. అవి పోతే పోయాయిలే అనుకొని మళ్ళీ తిరిగి రేవు దగ్గరికి వచ్చాడు. అక్కడ బట్టలు కూడా ఆ ప్రవాహంలో పడి కొట్టుకుపోయాయి. ఈ విధంగా ఉతుకుతున్న బట్టలూ పోయాయి - ఒడ్డున వున్నవీ పోయాయి రెండు విధాలా నష్టపడ్డాడు అందువల్ల 'రెంటికి జెడిన రేవడు' అని ఏర్పడిందని చెప్తారు.

'మక్కికి మక్కి' అనే జాతీయం మనం వాడుతూవుంటాం. అంటే ఉన్నది ఉన్నట్టు రాయడం అన్నమాట. మక్షికం అంటే ఈగ. ఈ

జాతీయానికి కూడా ఈ క్రింది కథ వుంది-

ఒకడు తన గుమాస్తాని పిలిచి ఒక పుస్తకం ఇచ్చి దాన్ని చూచి రాసి నకలు తయారు చెయ్యమన్నాడు. ఆ గుమాస్తా చాలా శ్రద్ధగా యజమాని మెప్పు పొందాలని ఉన్నది ఉన్నట్టుగా ఎత్తి రాశాడు. యజమాని రెండిటినీ పోల్చి చూశాడు. 'బాగానే రాశాడు' అనుకొంటూండగా ఒక పేజీలో చచ్చిన ఈగని అతికించినట్టు వుంది. గుమస్తాని పిలిచి 'ఇదేమిటి, ఈగని అతికించావా' అని అడిగాడు. వెంటనే గుమాస్తా 'అయ్యా, ఆ పుస్తకంలో ఆపేజీలో ఒక చచ్చిన ఈగ అంటుకొని వుంది. నేను ఏ మార్పులేకుండా ఉన్నది ఉన్నట్టుగా రాయాలన్న కోరికతో - ఒక ఈగను పట్టుకొని, చంపి, జాగ్రత్తగా అతికించాను - అంతే' అని సమాధానం ఇచ్చాడు. మక్కీకి మక్కీ అనువాదం - ఇలా వచ్చిందని చెప్తారు.

ఈ క్రింది జాతీయాలు కొన్నింటిని తెలుసుకుందాం:

*అట్టుడుకుట - లోకమంతా వ్యాపించటం, గగ్గోలు కావటం,

*అడుగులకు మడుగులొడ్డు - 'మడుగు' అంటే శుభ్రమైన వస్త్రం. నడిచినంత దూరం పాదాలక్రింద వస్త్రం- వేయటం - అంటే 'చిత్తం' అనే విధంగా లొంగివుండటం.

* ఉడుతా భక్తి - తోచిన విధంగా సేవచేయటం (శ్రీరాముడు వారధి కట్టేటప్పుడు ఒక ఉడుత ఇసుకలో పొర్లి నీటిలో వదుల్చుకొని - ఆవిధంగా ఇసుక తీసుకొనివెళ్ళి సేవ చేసిందిట!)

* గాడిదగుడ్డు - గాడిద గుడ్డు అసంభవం. కాబట్టి శూన్యం, వట్టిది కల్పితం అనటానికి వాడతారు (కొందరు గాడ్ ది గుడ్ అనే ఇంగ్లీషు మాట గాడిద గుడ్డు అయిందంటారు - కానీ అది సరదాగా చెప్పేదే)

* తిరుక్షౌరం - ఏమీలేకుండా చెయ్యటం; పూర్తిగా నష్టం రావటం, (తిరుపతిలో క్షవరం ఒక్క వెంట్రుక లేకుండా చేశావారు).

* శాఖా చంక్రమణం - ఒకదాని నుంచి వేరొక దాన్లోకి వెళ్ళటం (కోతి ఒక కొమ్మ మీంచి మరోకొమ్మ మీదకి దూకినట్టు)

* పరశురామ ప్రీతి - పరుశురాముడు అన్ని రాజవంశాల్ని చంపినట్టు పూర్తిగా నాశనం కావటం. అగ్నిలో కాలి పోవటం అనే అర్థం ఏర్పడింది.

## ఇక సామెతల గురించి కొంత తెలుసుకుందాం.

చాలామంది 'ఏదో సామెత చెప్పినట్టు' అని అంటూవుంటారు. ఇంతకీ 'సామ్యత' నుంచి 'సామెత' వచ్చింది. సామెతనే లోకోక్తి, నానుడి అని కూడా అంటారు. సామ్యత అంటే పోలిక. ఒక దృష్టాంతం. జీవితానుభవాల ద్వారా ప్రజలే ఈ సామెతల్ని సృష్టించుకొని అలా అలా ప్రచారం చేసు కొన్నారు. సామెతలు జీవిత వైవిధ్యానికి ప్రతీకలుగా నిలుస్తాయి కూడా.

'రామాయణంలో పిడకల వేట', 'రామాయణ మంతా విని రాముడికి సీత ఏమవుతుంది అని అడిగినట్టు', 'వింటే భారతం వినాలి - తింటే గారెలు తినాలి' వంటి సామెతలు మన ఇతిహాసాల వల్ల ఏర్పడినాయి. 'భారతం బొంకు - రామాయిణం రంకు' అనే సామెతవుంది. భారతానికి ధర్మజుడు ఆడిన ఆ ఒక్క అబద్ధమే (అశ్వత్థామపై) మలుపు. అలాగే రావణుడు సీతను ఎత్తుకు వెళ్ళటమే కథకి ఆధారం. కాబట్టి ప్రజలు రామాయణ భారతాల కేంద్ర బిందువును పట్టుకొని ఆ సామెతను తయారుచేశారు.

పూర్వకాలంలో ప్రయాణ సాధనాలులేవు. ఎంత దూరమైనా కాలి నడకనే వెళ్ళేవారు. రోడ్లు కూడా లేవు. అడవులలో పడి, చీకట్లో

వెళ్ళేవారు. దారిలో ప్రమాదాలూ, దొంగతనాలూ, రోగాలూ తప్పవు. పైగా 'కాశీ' వంటి దూర ప్రాంతానికి ప్రయాణమెంతో కష్టం. అందుకే 'కాశికి పోయిన వాడు కాటికి పోయినవాడు ఒకటే' అన్నారు! 'కాశీప్రయాణం అంటే మరణంతో సమానమని భావన!

ఎక్కడైనా బావ గానీ వంగ తోటలో కాడు', తిరిగే కాలు తిట్టే నోరూ వూరుకోవు', 'రోట్లో తల పెట్టి రోకటి పోటికి జడవటం ఎందుకు?' అనే సామెతలు హాస్యంతో కూడుకొని స్వభావాలను తెలుపుతాయి. కొన్ని సామెతలు సూక్తులులాగా నిర్దుష్టంగా చెప్పినట్టు వుంటాయి.

పరుల సొమ్ము పాపిష్టి సొమ్ము

అందని ద్రాక్ష పుల్లన

మౌనం అర్ధాంగీకారం

ఉల్లి చేసిన మేలు తల్లి కూడా చెయ్యదు

అమ్మయినా అడగందే పెట్టదు

ఉన్న మాటంటే ఉలుకెక్కువ

కొన్ని సామెతలు ప్రశ్నలు గానూ, మరి కొన్ని సంభాషణాత్మకం గానూ వుంటాయి. ఇంకొన్ని సామెతల్లో 'ప్రాస' కనిపిస్తుంది. పద్యాల్లో 'యతి' లాగా మొదటి భాగం మొదటి అక్షరంతో సమానమైన అక్షరం రెండో భాగం మొదట కనిపిస్తుంది. రెండు, మూడు వాక్యాలు కూడా సామెతల్లో వుంటాయి. ఈ క్రిందివాటిని పరిశీలించండి-

* అందరూ అందలమెక్కితే మోసేవారెవరు?
* తాయెత్తులకే పిల్లలు పుడితే తానెందుకు?
* చెరుకు వంకర పోతే, తీపి చెడుతుందా?
* తెల్లవారిన సంగతి నీకెట్లా తెలిసింది అని అడిగితే బయటికి పోవాల్సి వచ్చింది అన్నదట!
* పైసా, పైసా! ఏంజేస్తావూ అంటే ప్రాణమిత్రుడ్ని పగ చేస్తాను అందిట!

* బావా అని చూడబోతే రావా అని కొంగు పట్టుకున్నాడంట!
* బిడ్డ వచ్చిన వేళ గోడ్డు వచ్చిన వేళ
* బెల్లం వుందా అంటే అల్లం వుందన్నట్టు
* మొక్కై వంగనిదే, మ్రానై వంగునా?
* బాల వాక్కు బ్రహ్మ వాక్కు
* మబ్బు విడిచిన ఎండ, మొగుడు విడిచిన ముండ
* తేలు తేలండీ అని అరిస్తే, మొగవాళ్ళను పిలవ్వే అన్నాడట. మీరు మొగవారు కదా అని పెళ్ళామంటే, సమయానికి జ్ఞాపకం చేశావు కర్ర తెమ్మన్నాట్ట.
* గొడ్డలి ఎక్కడ పెట్టినావురా అంటే కొట్టే చెట్టు దగ్గిర, కొట్టే చెట్టు ఎక్కడుందిరా అంటే గోడ్డలి దగ్గర అన్నాట్ట.

మన కావ్యాలు, శతకాలు లోని సూక్తులు, పలుకుబడులు, 'సామెతలు'గా వ్యాప్తిలోకి వచ్చినవీ వున్నాయి -

'ఊరక రారు మహాత్ములు', 'పదుగురాడు మాట పాటియై ధర జెల్లు' 'తన కోపమే తన శత్రువు' మొదలైనవి అటువంటివి. నాగరకత మారినప్పుడు సామెతలు వాడటం తగ్గి క్రమేపి మాయమైపోతాయి. ఒకనాటి సమాజానికీ, సంస్కృతికీ అద్దం పట్టే సామెతల్ని భద్రపరచుకోవాలి!

## 'పొడుపు కథ'ల కథ!

సామెతలూ, జాతీయాలూ వాడినంతగా పొడుపు కథల్ని వాడరు గానీ - వీటికీ మన భాషలో ప్రాముఖ్యంవుంది. వినోదమే ప్రధానమైనా పొడుపు కథలు విజ్ఞానాన్ని కూడా కలగజేస్తాయి. మెదడుకి పదును పెడతాయి. 'పొడుచుట, విప్పుట' అనే లక్షణాలు పొడుపు కథల్లో వుంటాయి. ఇవి వచనం గానూ వుంటాయి, గేయం గానూ వుంటాయి. కొందరు పొడుపు కథల్ని పద్యాలుగా రాశారు కూడా. పొడుపు కథల్లో ఒక విషయంపై

సూచ్యంగా, భంగ్యంతరంగా వివరణ (క్లూ) వుంటుంది. దాన్ని బట్టి జవాబు చెప్పవలసివుంటుంది. పొడుపు కథ నిజానికి ఒక ప్రశ్న. అది గూఢంగా వుటుంది. ఊహాతీతంగా కనిపిస్తుంది. చిన్నప్పుడు మాట్లాడుకొనే 'క'భాష కూడా పొడుపుకథ వంటిదే. ఈ పొడుపు కథల్లో కూడా హాస్యం, చమత్కారం వుంటాయి. మానవ మనస్తత్వాల పరిశీలన కూడా కనిపిస్తుంది. అంత్యానుప్రాసలు వుంటాయి. లయబద్ధంగానూ వుంటాయి. ఈ పొడుపు కథల వంటివే మహాభారతంలోని యక్షప్రశ్నలు అని అంటారు.

'వంకరటింకర శొ
వాని తమ్ముడు అ
నల్ల గుడ్ల మి
నాలుగు కాళ్ళ మే

- ఈ పొడుపు కథలో జవాబుకి 'క్లూ' చివరి అక్షరాల్లో వుంది. శొ=శొంఠి; అ=అల్లం; మి=మిరియం; మే=మేక.

ఇలాగే ఈ క్రింది పొడుపు కథకి కూడా ఏ పాదానికి ఆ పాదంలోనే జవాబు వుంటుంది-

'దిబదిబలాడేవి రెండు
దిబ్బెక్కిచూచేవి రెండు
ఆలకించేవి రెండు
ఆదుకొనేవి రెండు'

దీనికి వరసగా - కాళ్ళు, కీళ్ళు, చెవులు, చేతులు అని సమాధానాలు. మరి కొన్నిట్లో వ్యతిరేకంగా చెప్పనే జవాబుకి 'క్లూ' ఇచ్చే పద్ధతి వుంది-

'ఆకాశంలో వుంటుంది - కాని మేఘం కాదు
తోకతో వుంటుంది - కాని ఎద్దు కాదు
అటు ఇటు తిరుగుతుంది - కాని పక్షి కాదు
పట్టు తప్పితే చాలు - పరుగులేస్తుంది.'

దీనికి 'గాలిపటం' జవాబు అని తెలిస్తే ఆనందం!

మన పొడుపుకథల్లో ఎన్ని వైవిధ్యాలూ, విచిత్రాలూ వున్నాయో ఈ క్రిందివాటి వల్ల తెలుసుకోవచ్చు-

* గోడమీద బొమ్మ
  గొలుసులబొమ్మ
  వచ్చేపోయేవారికి
  వడ్డించుబొమ్మ (తేలు)

* గుడినిండా ముత్యాలు
  గుడికి తాళం (దానిమ్మ పండు)

* చిటారు కొమ్మని
  మిఠాయి పొట్లం (తేనె పట్టు)

* చెక్కని స్తంభం
  చెయ్యనికుండ
  పొయ్యనినీళ్ళు
  వెయ్యని సున్నం (కొబ్బరి కాయ)

* ఒక గుడిలో ముగ్గురు దొంగలు (వేరుసెనగ కాయ)

* నున్నని పాము - పొడల పొడల పాము
  వాడవాడల పాము - వాలైన పాము
  చారాచారల పాము - చక్కని పాము
  పామును పట్టి కూర చేస్తే
  పంటికిందికే రాదు (పొట్లకాయ)

## సామాన్యంగా జరిగే అక్షర దోషాలు!

భాష రాసేటప్పుడు సామాన్యంగా తప్పులు తప్పవు. ఈ తప్పులు తెలిసి కూడ చెయ్యవచ్చు అశ్రద్ధ వల్ల చెయ్యవచ్చు. అసలు వ్యాకరణం

ప్రకారం అయితే 'రాయటం' కూడా తప్పే. అయితే వ్యావహారిక భాషలో వ్యాకరణం అక్కర్లేదు గానీ సహజమైన లక్షణాలనీ, నియమాలనీ పాటించాలి. చేయుడు, వ్రాయుడు వంటివి రాయక్కర్లేదు - చేయండి రాయండి అంటే చాలు. వాడుక భాష గదా అని సేయండి, సేయెండి, సేయిండి వంటివి (ఒక ప్రత్యేక ప్రయోజనం వుంటే తప్ప) రాయకూడదు. భాషా శాస్త్రం వచ్చిన తార్వాత, వ్యావహారిక భాషావాదాన్ని విశ్వవిద్యాలయాలు ఆమోదించిన తర్వాత ''భాష అందరిదీ'' అయింది. సులభమైంది. స్పష్టమైంది. ఈ స్వేచ్ఛ భాషకి ముప్పు తేకూడదు. భాషకున్న సహజత్వం అంతరించకూడదు. వ్యాకరణం లేదు గదా అని 'ఎలాగైనా రాయొచ్చు' అనడం విపరీత ధోరణి అవుతుంది. ఇంగ్లీషులో 'స్పెల్లింగ్' కి ఎంతో ప్రాధాన్యంవుంది. అయినా రాసే భాషకీ మాట్లాడే భాషకీ తేడావుంటుంది. ఇంగ్లీషులో 'వాక్'(walk) ని రాసినప్పుడు 'ఎల్' వుంటుంది. ఇలా చాలా అక్షరాలు రాసేటప్పుడు కనిపిస్తాయి తప్ప ఉచ్చారణలో వినిపించవు. తెలుగులో కూడా 'బ్రహ్మ' అని రాసినా, పలికేటప్పుడు 'బ్రమ్హ' అనటం వుంది. 'మధ్యాహ్నం' అనేది 'మజ్జాన్నం' అవుతుంది. ఈ తేడాలు గమనిస్తూనే భాషలో పదాల సహజ స్వరూపాన్ని తెలుసుకోవాలి. ఆ సహజస్థితిని కాపాడుకోవాల్సిన అవసరం వుంది. అందుకనే సామాన్యంగా మనం చేసే తప్పులు తెలుసుకుందాం. సాధ్యమైనంతవరకు ఆ తప్పులు చెయ్యకుండా వుందాం.

రు - ఋ అనే అక్షరాలు ఎక్కడ వాడాలో చాలామందికి తెలీదు. తెలిసి కూడా పాటించరు. శబ్దం అసలు రూపాన్ని నిర్లక్షం చెయ్యటం సబబుకాదు. అచ్చులో వీటికి భేదం పాటించడంలేదు. అటువంటివి కొన్ని-

| తప్పు | - | ఒప్పు |
|---|---|---|
| రుణం | - | ఋణం |
| రుతువు | - | ఋతువు |
| రుషి | - | ఋషి |

ఋకారాన్ని అక్షరాలలో సంయుక్తంగా రాసేటప్పుడు 'ృ' బదులుగా మామూలు ర వత్తు' - '్ర ' రాయటం మరోతప్పు.

| | | | |
|---|---|---|---|
| క్రుశించు అని రాయకూడదు | - | కృశించు అని రాయాలి | |
| అద్రుష్టం | '' | - | అదృష్టం '' |
| క్రుష్ణయ్య | '' | - | కృష్ణయ్య '' |
| ద్రుష్టి | ' | - | దృష్టి ' |

ఇలాగే '్ర ' రాయవలసిన చోట ' ృ ' రాస్తారు

| | | | |
|---|---|---|---|
| కృారుడు (తప్పు) | - | క్రూరుడు (ఒప్పు) | |
| శతృవు ' | - | శత్రువు | ' |
| శృతి '' | - | శ్రుతి | '' |
| తృంచు '' | - | త్రుంచు | '' |

'ట' వత్తు రాయవలసినచోట 'ఠ ' రాయటం, 'ఠ రాయవలసిన చోట ట' వత్తు రాయటం కూడా సామాన్యంగా చేసే తప్పు.

| | | | | |
|---|---|---|---|---|
| ముష్ఠి | (తప్పు) | - | ముష్టి | (ఒప్పు) |
| పుష్ఠి | ' | - | పుష్టి | '' |
| గోష్టి | '' | - | గోష్ఠి | '' |
| శ్రేష్టము | '' | - | శ్రేష్ఠము | '' |
| దృష్ఠి | ' | - | దృష్టి | '' |
| నిష్ట | '' | - | నిష్ఠ | ' |

కొన్ని పదాలలో ధ ధ'లలో ఏది ఎక్కడ రాయాలనేది చాలామందికి సందేహమే. ఒకదాని కొకటి రాస్తూవుంటారు. కొన్ని పదాలను గమనించండి:

| తప్పు | - | ఒప్పు |
|---|---|---|
| కధ | - | కథ |
| గాధ | - | గాథ |
| వీధి | - | వీథి |
| విద్యార్ది | - | విద్యార్థి |
| శిధిలం | - | శిథిలం |
| రాథ | - | రాధ |
| క్రోథం | - | క్రోధం |
| గంథం | - | గంధం |
| శోథించు | - | శోధించు |

ఒక్కొక్కసారి 'స -శ' లు రాయటంలో కూడా పొరపాటు దొర్లుతుంది. 'శెలవు' కిబదులుగా 'సెలవు' రాయాలి. 'సీత' సరైనది. 'శీత' కాదు. 'సేవ' ను 'శేవ'గా రాయకూడదు. శీతాకాలం (శీతకాలం అనాలి) లో మాత్రం 'శ' రాయాలి.

వత్తులున్న చోట తీసెయ్యటం, అవసరంలేని చోట రాయటం (లేదా పలకటం), ర్ణ - ర్న; న - ణ-; ల - ళ; స్త - స్థ లను తార్మారు చెయ్యటం వంటి దోషాలు కూడా కనిపిస్తాయి. ఈ క్రింది తప్పొప్పు పట్టికవల్ల దోషాలను గుర్తించవచ్చు.

| తప్పు | - | ఒప్పు |
|---|---|---|
| శబ్దం | - | శబ్దం |
| స్తంబం | - | స్తంభం |
| భావి(నుయ్యి) | - | బావి |
| రాయభారం | - | రాయబారం |
| భాధ | - | బాధ |
| విధ్య | - | విద్య |

| | | |
|---|---|---|
| అష్టిత్వం | - | అస్తిత్వం |
| శంఖుస్థాపన | - | శంకుస్థాపన |
| శాఖాహారం | - | శాకాహారం |
| సింధూరం | - | సిందూరం |
| తీర్ధము | - | తీర్థము |
| బద్ధకం | - | బద్ధకం |
| వర్నం | - | వర్ణం |
| సంపూర్న | - | సంపూర్ణ |
| విస్తీర్నం | - | విస్తీర్ణం |
| అవుషధం | - | ఔషధం |
| జాగర్త | - | జాగ్రత్త |
| గొర్రె | - | గొట్టె |
| స్వశ్చం | - | స్వచ్ఛం |
| దేముడు | - | దేవుడు |
| శిశ్రూష | - | శుశ్రూష |
| మహత్యం | - | మాహాత్మ్యం |
| సుబ్రమణ్యం | - | సుబ్రహ్మణ్యం |
| మలిఖార్జున | - | మల్లికార్జున |
| పయానం | - | ప్రయాణం |
| అవస్త | - | అవస్థ |
| కోపిష్టి | - | కోపిష్ఠి |
| భోదించు | - | బోధించు |
| మధ్యపానం | - | మద్యపానం |
| ఐఖ్యం | - | ఐక్యం |
| ధృవం | - | ధ్రువం |

## మనం వాడే పదాలలో ఎన్ని తప్పులో!

మనం వాడే పదాల్లో ఎన్నో తప్పులున్నాయి. మారిన ఆర్థిక, రాజకీయ, సాంఘిక రంగాల పరిస్థితుల వల్ల కొత్త పదాల అవసరం ఏర్పడింది. పత్రికల భాష ఏర్పడింది. ప్రజలు తమకి అనుకూలమైన, సులభమైన పదాలను వాడతారు. అనుకరణ (సామ్యం) వల్ల, శబ్దాలపై మోజువల్ల పదాలు ఏర్పడతాయి. నిజానికి వ్యాకరణం ప్రకారం చూస్తే మనం 'శుద్ధ తప్పులు' (ఇదికూడా వ్యాకరణం ప్రకారం తప్పే) వాడుతున్నాం. అయితే భాషాశాస్త్రం ఈ తప్పులు గుర్తిస్తూనే - ఆ తప్పులు ఎందుకు, ఎలా, ఎప్పుడు ఏర్పడతాయో వివరిస్తుంది. 'ఇలాగే వాడాలి - ఇలాగే రాయాలి' అని వాడుక భాషని ఎవరూ శాసించలేరు. ప్రజల ఇష్టమే తుది నిర్ణయం. ఎవరో ఒక పదం వాడతారు - అది 'పదుగురాడు మాట' గా చెలామణి అయితే స్థిరపడిపోతుంది. 'అది తప్పు మొర్రో' అన్నా వాడుక నుంచి తప్పుకోదు. జీవద్భాషకి 'మార్పు' సహజ గుణమే! మనం నిత్యం వాడుతున్న ముఖ్యమైన 'తప్పుడు పదాలు' (అపప్రయోగాలు) కొన్ని తెలుసుకుందాం:

'సామాగ్రి' అనే పదం వాడుతూవుంటాం. బహుశా ఇది 'సామాన్లు' బట్టి ఏర్పడిందేమో! ఇది సరి కాదు. 'సామగ్రి' అనే వుండాలి. అలాగే నట సామ్రాట్, కవి సామ్రాట్ లు తప్పు. దీర్ఘం లేకుండా 'సమ్రాట్' అనేదే సమంజసం. 'సౌభ్రాత్రం' అనాలి తప్ప 'సౌభ్రాతృత్వం' అనేది తప్పు. 'శక్తివంతులు' ఉండరు - శక్తిమంతులు తప్ప! తాను అనేది 'తన్ను' అవుతుంది. అలా వాడితే బాగుండదని 'తనను' అంటున్నాం. చాలామంది వాడే 'మేధస్సు పెరగాలి' లో మేధస్సు తప్పు. 'మేదస్సు' అంటే ఎముక, మెదడు అని అర్థం. మేధ అంటే బుద్ధి, తెలివి. 'మేధ' అంటే చాలు.' ఔపాసన పట్టడం' అంటారు. ఔపాసనం అంటే హోమం చెయ్యడం. 'పట్టడం' అనే ప్రయోగమే తప్పు కానీ నీరు త్రాగడం అనే అర్థంలో 'అపోశనం పట్టడం' అంటారు. చివరికి దీనికి స్వీకరించడం, తెలుసుకోవడం అనే అర్థాలు కూడా వచ్చాయి. ఐక్యత, ప్రాముఖ్యత,

ప్రాధాన్యత వంటివి ఐక్యం, ప్రాముఖ్యం, ప్రాధాన్యం - గా వుండాలి. గౌరవ్యులు, గౌరవనీయ అనే విధంగా వాడరాదు. గౌరవార్హులు, గౌరవనీయ అనవచ్చు. 'నిజానిజాలు' కూడా తప్పే. సత్యాసత్యాలు అనాలి.

## అగ్నిమాపక దళమా?

దీన్ని మనం 'అగ్ని ఆర్పేదళం' అనే అర్థంలో వాడుతున్నాం. 'మాపక' అంటే సంస్కృతంలో కాలిచేది అని అర్థం. తెలుగులో 'మాపు' అనేదివుంది. దాన్నిబట్టి మాపక వచ్చివుంటుంది. అప్పుడు అగ్నిని ఆర్పేదళం అనే అర్థం వస్తుంది. కానీ - అగ్ని, దళం అనే సంస్కృత పదాలమధ్య తెలుగు పదమైన 'మాపక' చేరటం తప్పే మరి!

## ఇష్టాగోష్ఠి తప్పు!

ఇష్ట - గోష్ఠి అనే రెండు పదాలతో సమాసం ఏర్పడితే 'ఇష్టగోష్ఠి' అవుతుంది తప్ప - ఇష్టాగోష్ఠి అవదు. కొందరు ఇష్టా గోష్ఠి అని అంటారు. ఇష్టులతో గోష్ఠి లేదా ఇష్టమైన గోష్ఠి అనే అర్థంలో 'ఇష్ట గోష్ఠి' సరైనది. ఇష్టాగోష్ఠి' అన్నప్పుడు ఇష్టురాంద్రతో గోష్ఠి అనే అర్థం వస్తుందిట!

## జయంతి, వర్ధంతులతమాషా!

'జన్మించిన రోజు' అనే అర్థంలో 'జయంతి'ని, 'మరణించిన రోజు అనే అర్థంలో వర్ధంతిని వాడుతున్నాం. నిజానికి ఆ పదాలకి ఈ అర్థాలు లేనే లేవు. శంకర జయంతి, గాంధీ జయంతి, అంబేద్కర్ జయంతి అనేవి ప్రసిద్ధి చెందాయి. అయితే 'రోహిణీ నక్షత్రంతో కూడిన కృష్ణాష్టమి' అనే అర్థం 'జయంతి' కి వుంది. ఆరోజు కృష్ణుడు పుట్టిన రోజు. కాబట్టి ఆ విధంగా మహాత్ముల జన్మదినంగా 'జయంతి స్థిరపడిందేమో! మరణించిన రోజును జరుపుకొనే ఆచారం భారతీయులది కాదు. సంస్కృతంలో వర్ధంతి శబ్దమే లేదంటారు. వృద్ధి చెందడానికి పుట్టినరోజున చేసుకొనే కర్మకాండకు సంస్కృతంలో 'వర్ధాపనం' అనే పదం వుంది. వృద్ధి చేసుకొనే పని అని వర్ధంతికి చెప్పుకొని - మరణించినా ఆత్మ అభివృద్ధి చెందుతుంది అనే

భాష్యం చెప్పుకొని - 'వర్ధంతి' ని సమర్థించుకోవాల్సి వస్తుంది. ఏమైనా ప్రజలు వీటికి కొత్త అర్థాలు స్థిరం చేశారు.

## పాత్రికేయులా? ఆశ్చర్యం.

పత్రికా రచయితలు, విలేఖర్లు అనే అర్థంలో 'పాత్రికేయులు' వాడబడుతోంది. నిజానికిది సరికాదు. 'పత్రికల కొడుకులు అనే అర్థంలో 'పాత్రికేయులు' ఏర్పడుతుంది. గాంగేయుడు, రాధేయుడు, పాండవేయులు లాగా 'పాత్రికేయులు' అనే పదం 'సామ్యం' వల్ల ఏర్పడింది. కాబట్టి 'పత్రికా రచయితలు' అనవచ్చు. లేదా పాత్రికీయులు, పత్రికీయులు, పాత్రికులు అనాలి.

## సమాఖ్య ఏమిటి?

సాహితీ సమాఖ్య, యువజన సమాఖ్య వంటి సంస్థల్ని చూస్తూవుంటాం. ఇందులో 'సమాఖ్య' అనే సంస్కృత పదానికి పేరు, కీర్తి అనే అర్థాలు తప్ప సంఘం, కూటమి అనే అర్థాలు లేవు. 'సమజ్య' అంటే సభ. కాబట్టి సాహితీ 'సమజ్య' అనవలసివుంటుందన్నమాట!

## 'స్పృహ' లేదూ?

'సామాజిక స్పృహ', 'వాడికి స్పృహ రాలేదు' అనే విధంగా వాడుతూ వుంటాం. స్పృహ అంటే అసలైన అర్థం 'కోరిక' అని. కానీ, ఆ అర్థం పోయి జ్ఞానం, తెలివిడి, అవగాహన అనే అర్థాలు ఏర్పడ్డాయి.

## నిర్దోషి కూడా దోషమే!

ఇది సంస్కృత పదం. 'దోషం చేయని వాడు' అనే అర్థంలో 'నిర్దోషి'ని వాడుతున్నాం. కానీ, వ్యాకరణం ప్రకారం ఇది తప్పు. నిర్దోషుడు, అదోషుడు అనవలసివుంటుంది.

## రైతాంగం ఎలా వచ్చింది?

రైతు, అంగం అనే రెండు పదాలతో రైతాంగం ఏర్పడింది రయ్యత్ అనే అరబిక్ పదంనుంచి రైతు వచ్చింది. అంగం సంస్కృత పదం. రైతు + అంగం అనేది తెలుగు సంధి ప్రకారం అయితే 'రైతంగం' కావాలి. సంస్కృతం ప్రకారమైతే 'రైత్వంగం' కావాలి. ఇంతకీ 'రైతాంగం' అర్థం ఆలోచించవల్సిందే!

ఈ విధంగా మనం వాడే పదాలు వ్యాకరణం ప్రకారం దోషాలే అయినా ప్రజలు, రచయితలు తమకి అనుకూలంగా వున్నాయని 'ఆమోద ముద్ర' వేశారు. కాబట్టి అవి స్థిరపడిపోయాయి. ఇప్పుడు వాటిని అలా వాడొద్దు - ఇలా వాడండి అనడం వల్ల ప్రయోజనమూ లేదు - ప్రజల వ్యవహారానికి అడ్డు కట్ట వెయ్యనూలేము. ఈ వివరణ, తప్పొప్పులు ఎందుకంటే తెలుసుకోవడానికి - భాషాస్వరూపం గ్రహించడానికి - భాష ఎలా మార్పులు చెందుతుందో పరిశీలించడానికి - అందుకే! అందుకే మరి కొన్ని ఉదాహరణలు -

| తప్పు | - | ఒప్పు |
|---|---|---|
| గాంధేయవాది | - | గాంధీయ వాది |
| విలేఖరి | - | లేఖకుడు, లేఖరి. |
| కాంగ్రేసేతరులు | - | కాంగ్రెసేతరులు |
| కంఠోపాఠం | - | కంఠపాఠం |
| అయిష్టం | - | అనిష్టం |
| ఆహ్వానితులు | - | ఆహూతులు |
| ఈశాన్యం | - | ఐశానీ |
| తద్వారా | - | తద్ద్వారా |
| దేవాదాయ | - | దేవదాయ |
| ధారావాహికం | - | ధారావాహకం |
| నిస్వార్థ | - | నిస్స్వార్థ |

| | | |
|---|---|---|
| పతాకం | - | పతాక |
| పూర్వీకులు | - | పూర్వులు |
| పునరావృతం | - | పునరావృత్తం |
| యావన్మంది | - | యావజ్జనం |
| రాజరికం | - | రాచరికం |
| విద్యుదీకరణం | - | విద్యుత్కరణం |
| స్వల్పకాలిక | - | స్వాల్పకాలిక |

## మనుషుల పేర్లూ - ఊళ్ళ పేర్లు!

'పేరులోనే వుంది పెన్నిధి' అంటారు. మానవ సమాజంలో ఒక మనిషిని మరో మనిషి నుంచి గుర్తించాలంటే మాత్రం 'పేరు' అవసరం. మనుషుల పేర్లకీ, ఊళ్ళ పేర్లకీ పెద్ద చరిత్ర వుంది. చారిత్రక, ఆర్థిక, సామాజిక, సాంస్కృతికాది అంశాలతో ఇప్పుడీ పేర్లమీద పరిశోధనలు జరుగుతున్నాయి. మనిషికి పేరు పెట్టడం అనేది 'బారసాల' లో జరిగే నామకరణ మహోత్సవం గదా!

అన్ని మతాలవాళ్ళు తమ సంప్రదాయాలకి అనుగుణంగా మనుషులకి పేర్లు పెడతారు. దైవ సంబంధమైన, మత సంబంధమైన పేర్లు ఎక్కువగా కనిపిస్తాయి. కులాలు సూచించే శాస్త్రి, రాజు, రెడ్డి, చౌదరి, నాయుడు, సెట్టి వంటివి కొందరి పేర్లలో కనిపిస్తాయి. ఒక వూళ్ళో 'సత్యం' అనే పేరు చాలామందికి వుందనుకోండి. అప్పుడు అంతమందిని ఎలా గుర్తించడం? ప్రజలు వాళ్ళ స్వరూప స్వభావాలు ఆధారంగా పేర్లు పెట్టుకుంటారు. ఇలా - ఎర్రసత్యం, నల్లసత్యం, సొరాసత్యం, లావుసత్యం, మిల్లుసత్యం, బక్కసత్యం, పొట్టిసత్యం. కుటుంబ సభ్యులైన తాతల, బామ్మల పేర్లు రావాలనీ, తమ ఇష్టదైవం పేరు రావాలనీ, జన్మనక్షత్రానికి సరిపడే అక్షరం వుడాలనీ - ఇన్ని కోరికల వల్ల పాపం అతగాడు 'వీరవెంకటబాలసత్యనరసింహవరప్రసాదగౌరీరమణమూర్తి' అయిపోతాడు. అప్పుడు మిత్రులు అతన్ని 'ఎబిసిడి మూర్తి' గా పిలుచుకుంటారు.

సూర్యచంద్రుల్ని కూడా మనవాళ్ళు దైవాలుగా భావించడం వల్ల సూరయ్య, సూర్యనారాయణ, సూర్యం, చంద్రయ్య, చంద్రరావు అనే పేర్లు ఏర్పడ్డాయి. గ్రామ దేవతలనుబట్టి గంటాలమ్మ మరిడమ్మ, నూకాలమ్మ, పళ్ళాలమ్మ వంటి పేర్లు స్త్రీలలో ఎక్కువగా కనిపించినా పోతురాజు, పళ్ళంరాజు, మరిడయ్య వంటి పురుషుల పేర్లుకూడా లేకపోలేదు. మన దేశనాయకులైన గాంధి నెహ్రూ, తిలక్, బోస్‌ల పేర్లు కొందరు పెట్టుకుంటే, ఇంకొందరు కాళిదాసు, శ్రీనాధుడు వంటి పేర్లు పెట్టుకుంటారు. పూర్వం ఎప్పుడో ఎవరో అవధానాలు చేసివుంటారు - ఆ విధంగా కొందరి పేర్లలో 'అవధాని, అవధాన్లు' వుంటాయి.

మన తెలుగువాళ్ళ పేర్లలో ఎక్కువగా కనిపించేది 'వెంకట' అనే శబ్దం. వెంకటేశ్వర్లు, వెంకటేశ్వరరావు, వెంకన్న, వెంకయ్య, వెంకమ్మ, (ఎంకమ్మ), వెంకోజి, వెంకడు, వెంకటరమణ మొదలైన పేర్లు మనకి సుపరిచితాలే. కొందరు వేం + కట = పాపాలను పరిహరించేవాడు అనే అర్థం చెప్తారు. అయితే మరికొందరు ఇది సరికాదని - వెంగడం (తమిళం) నుంచి 'వెంకట' వచ్చినదని అంటారు. 'వెళ్ + కడం అంటే తెల్లటికొండ అని అర్థం. వెంగమాంబ వెంగళప్ప, వెంగళరావు, వెంగళరెడ్డి లలోని 'వెంగళ' కూడా 'తెల్లకొండ' కిసంబంధించిందే. వెంకటేశ్వరుడ్ని శ్వేతాచలపతి అనీ శ్వేతాద్రి నిలయుడనీ అనటం లేదా?

'కొండ' చివర గల పేర్లు తెలుగులో ఎన్నో వున్నాయి. 'చలం, అద్రి, గిరి, కొండ' లు తెలుగు వాళ్ళకి ఇష్టమైనవే. అందుకే వెంకటాచలం, శేషాచలం, శోభనాద్రి, శేషాద్రి, సింహాద్రి, వేదగిరి శేషగిరి మొదలైనవి కాకుండా తెలుగు 'కొండ' కి ప్రాధాన్యం గల 'కొండలరావు' కొండయ్య, కొండారెడ్డి, మాలకొండయ్యలే కాక 'ఏడుకొండలు' కూడా లేకపోలేదు!

ఇటీవల ఈ పేర్ల పై శ్రద్ధ ఎక్కువైంది. పాత కాలపు పేర్లు క్రమంగా కనుమరుగైపోతున్నాయి. మారిన పరిస్థితుల్ని బట్టి కులాన్ని సూచించే

పేర్లు తగ్గిపోతున్నాయి. అందంగా, ఆకర్షణీయంగా, ప్రత్యేకతగా వుండే రమణి, సౌమ్య, కార్తీక్, లవలి, శ్వేత, ప్రణామ్, అభిషేక్, స్నిగ్ధ వంటిపేర్లూ, వెన్నెల, లవణం, సమరం వంటి పేర్లూ ఎక్కువవుతున్నాయి. చాంతాడువంటి పేర్లు కనపడటం లేదు. కొందరు తమ పేర్లని కత్తిరించేసి 'ఎం.ఎస్.చారి', 'పి.యస్.మణ్యం', 'టి.యు.వర్లు' అనే విధంగా చేసుకుంటున్నారు. 'నంజు' అంటే కన్నడంలో విషం. 'ఉణ్' అంటే మింగిన, విషం మింగిన దేవుడు (శివుడు) అనే అర్థంలో కొందరు నంజుండప్ప, నంజుండయ్య, నంజయ్య అనే పేర్లు పెట్టుకుంటున్నారు. బిడ్డలు పుట్టి మరణించినా, రోగాలు వచ్చినా, గ్రహచారం బాగుండలేదనో కీడును శంకించో తమ బిడ్డలకి పెంటయ్య, పిచ్చయ్య, వెర్రియ్య, ముసలయ్య, పకీరు వంటి పేర్లు పెడతారు. ఆ పేరుమీదుగా కీడు తొలగిపోతుందని నమ్ముతారు. ఇవికాక ముద్దు పేర్లు, పెట్టుడు పేర్లు (నిక్ నేమ్స్), మారు పేర్లు ఉంటాయి. ఆఫీసులో కృష్ణకిశోర్ - ఇంట్లో 'కిట్టి' అయిపోతాడు. కాలేజీలో 'సౌందర్య' కావచ్చు - అమ్మకి 'బుజ్జి' అవుతుంది. అమ్మడు, చిన్ని, సత్తి, సత్తిపండు, వెంకి వంటివి ఇటువంటివే!

కవులు, రచయితలు కలం పేర్లు వాడటం మామూలే. శ్రీరంగం శ్రీనివాసరావు - శ్రీశ్రీ అయితే గుమ్మడి విఠల్ 'గద్దర్' అయ్యాడు. పురాణపండ సూర్యప్రకాశదీక్షితులు అంటే తెలీదు - ఉషశ్రీ అంటే తెలుస్తుంది. గుడిపాటి వెంకటచలం 'చలం' గా మిగిలిపోయాడు. ఆత్రేయ అసలుపేరు కిళాంబి నరసింహాచార్యులు. సత్తిరాజు లక్ష్మీనారాయణ - ఎవరోకాదు మన బొమ్మల 'బాపూ!' ఒకేమనిషికి రెండు పేర్లుంటాయి. అప్పుడు ఇలా అంటారు - భూషియ్య ఉరఫ్ రమణయ్య, బుల్లియ్య అనే రామరాజు. పెట్టుడు పేర్లలో రకరకాల గమ్మత్తులు, విచిత్రాలు కనిపిస్తాయి - బందరు లడ్డు, బకాసురుడు, రింగు మాస్టర్, వంకాయగాడు, సోడా బుడ్డి, ముక్కులాడి (వగలాడిలాగా), సాంబారుగాడు, బోకు, బ్యాండ్ మేస్టర్, సుత్తిగాడు మొదలైనవి.

ఊళ్ళ పేర్లకి కూడా ఎంతో చరిత్ర వుంది. పురాణ కథలు ఆధారంగా

కొన్ని పేర్లు కనిపిస్తాయి. గయాసురుడు పడిన చోటు కాబట్టి 'గయ'! శాపగ్రస్తులైన నూర్గురు కుబ్జలు (పొట్టివారు) కన్యలే! వారు నివసించిన చోటు కాబట్టి 'కన్యాకుబ్జం' అయిందంటారు. భీముడు సౌగంధిక పుష్పాన్ని తెచ్చి ద్రౌపదిని పిల్చి 'ఇదిగో పూవు, తల పట్టు' అన్నాడట - అప్పటినుంచి ఆస్థలం 'పూతలపట్టు' అయిందట! (భీముడికి తెలుగు వచ్చేమో!) ఇటువంటివి అలావుంచితే - శబ్దాన్ని బట్టి, చరిత్రని బట్టి ఆధారాలతో వివరించినవి చూద్దాం. 'గుండ్ల మడుగు' అనేది మహామంత్రి తిమ్మరుసు పేరుమీదు గా 'తిమ్మ సముద్రం' అయింది. బ్రాహ్మణులకి ఇవ్వబడింది లేదా బ్రాహ్మణుల భాగం అనే అర్థంలో 'బ్రహ్మదేవం' ఏర్పడింది. డచ్చివారు, ఫ్రెంచివారు పాలించినప్పుడు వలందపాలెం, పరాసుపేట అనే పేర్లు ఎర్పడ్డాయి. వాగుల్లంక, చెయ్యేరు, సేలేరు వంటవి నీటికి సంబంధించినవి. నేల స్వభావాన్ని బట్టి ఇసుకపూడి, ఉప్పలపాడు, గరుగుపల్లె ఏర్పడ్డాయి. కుమ్మరిపాలెం, పెకికె గూడెం, బ్రాహ్మణపల్లె, యాదవాపురం అనేవి కులాలు ఆధారంగా ఏర్పడ్డాయి. దైవసంబంధమైన పేర్లలో హనుమాన్ జంక్షన్, మంగళగిరి, దేవతాపురం, మొదలైనవి వున్నాయి. జంతు, వృక్ష సంబంధమైన వాటిల్లో నెమళ్ళదిన్నె, గద్దనాపల్లి, నక్కలపాడు, చింతపల్లి, దొండపాడు, మామిడికుదురు మొదలైనవి కొన్ని. తెలుగుపదాల్ని సంస్కృతీకరించి హేలాపురి, సింహపురి అని వాడుతున్నారు. సామాన్యంగా ఊళ్ళపేర్లు రెండు పదాలతో వున్నా కాజ, మోరి, గంటి, దర్శి, కంబం, తడ అనే విధంగా ఒకే పదంతో వున్నవీ కనిపిస్తాయి.

## ప్రకృతి నుంచి వచ్చిన పదాలు ఇవి!

ప్రకృతికీ భాషకీ సంబంధం కనిపిస్తుంది. మనవుడు తన భావ ప్రకటనకి ప్రకృతిని వాడుకుంటాడు. అంటే ప్రకృతిలోని పరిసరాలను, జంతువుల్ని, పక్షుల్ని, చెట్లను...... అన్నిటినీ భాషలో ఉపయోగించుకొని భావానికి బలం చేకూర్చుకుంటాడు - భాషని శక్తివంతంగా మలుచు కుంటాడు.

మనలో జిత్తులమారి నక్కలుంటారు. మేక వన్నె పులులూ, గోముఖ

వ్యాఘ్రాలూ వుంటారు. 'గాడిద బరువు' మోయక తప్పదు. 'కుక్క' విశ్వాసానికి ప్రతీక. అంతేకాదు 'వాచ్ డాగ్' అలవాటే గదా! ఏనుగు చచ్చినా బతికినా వరహాల పంట గదా! రాజకీయాల్లో కప్ప గంతులు' సహజమే గదా! నత్త నడక, తాబేలు నడకలతో పాటు ఉడుతాభక్తీ వుంటుంది. ఊసరవెల్లి నాయకులూ, గోడమీది పిల్లలూ, పాము చెవులూ, బొబ్బిలి పులులూ, కవి కంఠీరవాలూ, చేప కళ్ళూ మనకి కొత్తేమీకాదు. అన్నట్టు 'సింహావ లోకనం' లేదూ? గడ్డలా తన్నుకు పోతారు కదా! చిలుక పలుకులు సరే సరి! హంస నడకలు అతివల సొత్తు అంటారు. కొంగ జపాలు చెయ్యని వారు తక్కువే మరి! లోకులు కాకులు అన్నది నిజమే! కాకమ్మ కబుర్లు సరేసరి. కొందరు గుడ్లగూబలా చూస్తారు! కుక్కమూతి పిందెలు తెలీవా?

తుమ్మెదలతో జుట్టు పోలుస్తారు. పాముజడలూ వుంటాయి. శంఖంలాంటి కంఠం లేకపోలేదు. పద్మాక్షులూ, పద్మనేత్రుడూ, కమలాక్షుడూ లేరామరి? సూర్యుడు విప్లవానికి, తిరుగుబాటుకి సంకేతం! గాలి మాటలు మాట్లాడే గాలి మనుషులున్నారు. 'గాలి పట్టింది' అంటాం గదా! గాలి తీసేస్తాం కూడా! కొందరిళ్ళలో తుఫానులూ, ఉరుములూ తప్పవు! ఎదురీదటం కష్టమే! తోటకూర కాడ లాగా ఉన్నావేరా! అనటమూ వుంది. సొరకాయలు కోయటమూ వుంది. దోసపాదులా సంతానంతో కళకళలాడాలని ఆశిస్తారు. వేపకాయంత వెర్రి ఎవరికైనా వుంటుంది. చింత చచ్చినా పులుపు చస్తుందా? నేతి బీరలో నేయి వుంటుందా? చల్లకి వచ్చి ముంత దాయటం ఎందుకో! దున్నపోతు మీద వాన అనుకోండి! అడ్డగాడిదలనటం వినే వుంటారు...... పత్రాలూ, ఋణపత్రాలు, పుష్పాంజలులూ, బీరకాయ పీచు, దూలగొండి, చొప్పదంటు ప్రశ్నలూ, దుంప తెగటాలూ....ఎన్నో!!

## వీటి అర్థాలూ - వివరణలు తెలుసా!

శంఖుస్థాపన

ఇది శంకుస్థాపన త్రిభుజాకారంలో వున్న మొన తేలిన కర్రని

'శంకు' అంటారు. భూమిపూజ చేసేటప్పుడు ఈశాన్యంలో నాటే కర్ర 'శంకువు'. దాన్ని పూజించిన తర్వాత కట్టడం ప్రారంభిస్తారు.

### భరతం పడతా

'నీ భరతం పడతా' అనే ప్రయోగం తెలుసు. నాటకంలో భరత వాక్యం వుంటుంది. నాటకం చివరలో పలికే వాక్యం అది. దాన్ని బట్టి భరత వాక్యం అంటే ముగింపు, చివర అనే అర్థాలు వచ్చాయి. భరతం పడతా అంటే నీ ముగింపు లేదా నీ అంతం చూస్తా అని అర్థం.

### ధూమకేతువు

తెలుగు లోగల 'తోక చుక్క'ని సంస్కృతీకరణ చేసినట్టుగా 'ధూమకేతుః' ఏర్పడింది. చుక్క అంటే నక్షత్రం. నక్షత్రానికి తోకలా వుంటుంది కాబట్టి 'తోకచుక్క' అనడం సమంజసంగావుంది. ధూమకేతువు' సరికాదని, 'ధూమకేతనం' అనాలని కొందరి అభిప్రాయం. ఏ నక్షత్రానికి ధూమం (పొగ) కేతనంగా వుంటుందో అది ధూమకేతనం. అయితే కేతువుకి ధూమంగా వుంటుందనుకొని, కేతువు కూడా దుష్టగ్రహం కాబట్టి 'ధూమకేతువు'గా మారిందేమో!

### తాతాచార్యులవారి ముద్ర

తాతాచార్యులవారి ముద్ర పడిందంటే అది ప్రతిభకి, గుర్తింపుకీ చిహ్నం. కృష్ణదేవరాయల గురువుగారు తాతాచార్యులు. అయన వైష్ణవ మత గురువు. ఎవరన్నా వైష్ణవ మతం తీసుకుంటే విష్ణు చక్రంలాంటి గుర్తును వీపు మీద, భుజంమీదా కాల్చి వేస్తారు. దాన్ని 'చక్రాంకితాలు' అని కూడా అంటారు. కాబట్టి మత స్వీకారానికి గుర్తుగా ఇలా ముద్ర వేసేవారు. అప్పటినుంచి 'యోగ్యత' లభిస్తుంది. అదొక సర్టిఫికేట్ లాంటిదన్నమాట. అలా తాతాచార్యులవారి ముద్ర వాడుకలోకి వచ్చింది

### చిల్లర శ్రీమహాలక్ష్మి

అసలు డబ్బే శ్రీమహాలక్ష్మి కానీ చిల్లర డబ్బులు దృష్టిలో పెట్టుకొని

'చిల్లర శ్రీమహాలక్ష్మి' అన్నారు. చిల్లర డబ్బులు రూపాయిలకి ఎక్కువ వస్తాయి. గలగల మంటాయి. కాబట్టి లక్ష్మి తాండవిస్తున్నట్లు భావించడంవల్ల ఆవిధంగా అని వుండవచ్చు. పెద్ద వ్యాపారం చేసి అనేక బాధలు, సమస్యలు కొనితెచ్చుకొనే బదులు చిన్న వ్యాపారం చేయటం నయం. చిల్లర వ్యాపారాన్ని తక్కువగా చూడకూడదనే ఉద్దేశంతో 'చిల్లర శ్రీమహాలక్ష్మి' అనే మాట ప్రచారంలోకి వచ్చి వుండవచ్చు.

### నలుగురితో నారాయణ

అందరూ ఏమంటే మనమూ అదే అనాలి. నలుగురితో పాటే మనమూ! - ఈ భావంలో 'నలుగురితో నారాయణ' అనేది వాడతారు. నలుగురు నారాయణ అంటే అందరూ నారాయణ అంటారు. 'నలుగురితో నారాయణ, కులంతో గోవింద' అనే సామెత కూడావుంది. నచ్చినా నచ్చకపోయినా అందరితో పాటే ప్రవర్తించాలని దీని అర్థం.

### ఈ 'కొట్టడాలు' చూడండి!

బడ్డీకొట్టు, బియ్యంకొట్టు అన్నప్పుడు కొట్టుకి 'దుకాణం' అని అర్థం. 'వాడ్నికొట్టు' అన్నప్పుడు అర్థం తెలుసు. కానీ 'జైకొట్టడం', 'తైరుకొట్టడం', మాత్రమే కాదు 'ఓ టీ కొట్టు గురూ' అనడమూవుంది. వీటితో పాటు 'గోవింద కొట్టింది' అంటారు. 'పరీక్ష గోవింద కొట్టింది', 'వాడు వ్యాపారంలో గోవింద కొట్టాడు' వంటివి వినబడుతూ వుంటాయి. ఏడుకొండలవాడికి 'గోవిందా' అంటూ పలుకుతారు. చివరికి 'గోవిందా' అనేది పోయింది, దివాళా తీసింది, నష్టం వాటిల్లింది అనే అర్థాలలో ప్రజలు వాడారు. కాబట్టి 'గోవింద కొట్టింది' అనే దానికి అర్థం మారింది.

### పడికట్టు రాళ్ళు

కొందరు కొన్ని మాటల్ని అవసరం వున్నా లేకపోయినా వాడుతూవుంటారు. అందువల్ల తమ స్థాయి, గౌరవం పెరుగుతుందను కుంటారు. త్రాసులో రెండు వైపులా సమానంగా లేకపోతే, ఆ తేడా

పోపడానికి, తూకం సరిగావుండటానికి చిన్న రాళ్ళు వేస్తూ వుంటారు. తూకం తూచే ప్రతిసారీ ఆరాళ్ళనే ఉపయోగిస్తాడు. కాబట్టి వాటిని పడికట్టు రాళ్ళు అంటారు. 'ఆయన ఉపన్యాసంలో ఎప్పుడూ పడికట్టు పదాలే' అన్నప్పుడూ వాడిన పదాలే, ఎప్పుడూ చెప్పే పదాలే చెప్తున్నాడని అర్థం.

## గొంతెమ్మ కోరిక

'కుంతి'కి వికృతి పదం గొంతి. గొంతెమ్మ కోరిక అంటే కుంతీదేవి కోరిక కుంతీదేవి కోరరాని కోరిక కోరి సూర్యుడి ద్వారా కర్ణుడ్ని (కన్యగా ఉండగానే) కని బాధపడింది. అలా అనుచితంగా అసాధ్యంగా కోరటం 'గొంతెమ్మ కోరిక అయింది. మహాభారత యుద్ధంలో పాండవులూ, కర్ణుడూ కూడా బతికివుండాలని కోరుకుంది కాబట్టి, అది సమంజసం కాదని - అందువల్ల 'గొంతెమ్మ కోరిక' ఏర్పడిందన్న అభిప్రాయం అంత సమంజసంగా లేదు. గొంతికి అమ్మని కలిపి 'గొంతెమ్మ'ను చేశారు.

## అత్తెసరు

'అవి అత్తెసరు మార్కులు', 'దానికి అత్తెసరు పెట్టాడు' అని ఒకనాడు బాగా వాడేవారు. అత్తగారు అప్పుడప్పుడు వార్చకుండా అన్నం వండటాన్ని అత్త + ఎసరు = అత్తెసరుగా లోకంలో కొందరు చెప్పుకుంటారు. కాని నిజానికి అది అత్తు + ఎసరు. పోసిన బియ్యానికీ, నీటికి సరిగా అతికినట్లు పోసిన ఎసరు. 'ఎసరు పెట్టాడు' అంటే మోసం, ద్రోహం చేయటం అని కూడా వుంది. ఎసరు పెట్టడం అంటే 'వండటం' కాబట్టి 'మంట బెట్టడం' గా ఆ అర్థాలు వచ్చాయేమో!

## అరవచాకిరి

'ఎవడు చేస్తాడు, ఈ అరవ చాకిరీ!' అంటారు ప్రతిఫలం లేకుండా వూరికే చేసే పని అనే అర్థంలో వాడుతున్నాం నిజానికి ఇందులో అరవవాళ్ళ (తమిళుల) ప్రసక్తి లేనే లేదు. ఇది 'అరువు చాకిరి'. అరువుగా చేసిన తర్వాత ఎప్పుడో డబ్బులు (వస్తే) వచ్చే పని. చాకర్ నుండి చాకిరీ వచ్చింది

**చక్రకేళీపండు**

ఈ పేరు ఎలా వచ్చింది? చక్రంలా గుండ్రంగా వుంటుందా? హిందీలో కేలా - కేళీ అయిందా? అనే సందేహాలు రావచ్చు. కదళీనుంచి కేళీ (ఉత్తరాది భాషలనుంచైనా కావచ్చు) వచ్చింది. శర్కర (పంచదార) వంటి తీపి గలది. కాబట్టి శర్కరా కదళ్ - ప్రాకృతంలో సక్కరా కమళ్‌గా మారి తెలుగులో చక్కెరకేళి కావల్సింది - చక్రకేళి అయింది.

**శాఖాహారమా?**

'శాఖాహార భోజనశాల' అనే బోర్డులు చూస్తాం. శాఖ అంటే చెట్టు కొమ్మ. చెట్టు కొమ్మలు ఆహారంగా పెట్టే హోటల్ - అనే అర్థం వస్తుంది. అసలు ఇది శాకము. అంటే కాయగూరలు. కాబట్టి కాయగూరలతో భోజనం పెట్టే శాలగా 'శాకాహారం' అని వాడాలి. పూర్వం బ్రాహ్మణులు మాంసం తినేవారు కాదు - కాయగూరలే తినేవారు. కాబట్టి ఆ ఆచారం ప్రకారం 'బ్రాహ్మణ భోజన హోటల్' అయింది. అంతే తప్ప బ్రాహ్మణులది - కాదు. వండేవారు బ్రాహ్మణులూ కాదు - బ్రాహ్మణులకి మాత్రమే హోటలూ కాదు. ఇప్పుడిప్పుడే ఈ బాధలేమీ లేకుండా చాలామంది వెజిటేరియన్, నాన్ వెజిటేరియన్ అనే ఇంగ్లీషు మాటలు వాడుతున్నారు.

**తక్షణం ఎలా?**

తత్ + క్షణం = తత్‌క్షణం అవుతుంది. దీనిని రాయటం, పలకటం శ్రమగా, కష్టంగా భావించి 'తక్షణం' చేసేశాం. 'వెంటనే' అనే అర్థంలో తక్షణం అయింది.

**ఫలహారం ఏమిటి?**

ఫల + ఆహారం = ఫలాహారం కావాలి. పండ్లు ఆహారంగా తీసుకోవటం. ఇప్పుడు పండ్ల ఆహారం లేదు. ఉప్మా ఇడ్లీ, చపాతీ వంటివి ఏం తీసుకున్నా ఫలాహారమే. 'టిఫిన్'కి బదులుగా వాడుతూ ఫలహారం - పలారం గా మార్పు చెందింది.

యజమాని ఎవరు?

యజమాని అనేది సంస్కృతం. తెలుగులో యజమానుడు అని వుండాలి తప్ప 'యజమాని' తప్పు యజమానుడు అంటే యజ్ఞాలు చేసేవాడు, యజమానులు కలవాడు అనే అర్థాలున్నాయి. కాని, తెలుగులో అధికారం, పెత్తనం చేసేవాడు, అధిపతి అనే అర్థాలున్నాయి. ఈ ఇంటి యజమాని ఎవరండీ? అంటాం.

## కొత్త పదాలూ... కొత్త అర్థాలూ... కొత్త జాతీయాలూ...

ఎప్పటికప్పుడు భాష మారిపోతోంది. ఇతర భాషలనుండి కొత్తపదాలు కొత్త అర్థాలతో వాడుకలోకి వస్తున్నాయి. సరికొత్త జాతీయాలు ప్రచారంలోకి వస్తున్నాయి. తరం మారింది కాబట్టి, సమాజం మారింది కాబట్టి దానికనుగుణంగా భాషా వ్యవహారం మారుతోంది.

ఫిరాయింపులూ, జెండా మార్చటాలూ, ఆయారామ్ గయారామ్‌లూ మన రాజకీయాల్లో సహజమే! ఇళ్ళల్లోనూ, ఆఫీసుల్లోనూ అధికార పక్షం వాళ్ళు, ప్రతిపక్షం వాళ్ళూ వుంటారు. అర్ధాంగిని 'హోమ్‌మినిస్టర్' అంటున్నాం. డబ్బులు లేవు, డబ్బుకి ఇబ్బంది అనే అర్థంలో 'మన్మోహన్ సింగ్ లేడురా' అనటం వుంది.

'ఫిగరు బాగుందిరా' అనే బీటుగాళ్ళు కనిపిస్తారు. స్టిల్ ఇచ్చేవాళ్ళు మాత్రం లేరంటారా? లైన్ వెయ్యడంలో శ్రద్ధ ఎక్కువ యువతీ యువకులకి! క్రికెట్ ఆటనిబట్టి 'మా వాడు ఫాస్ట్ బౌలర్', 'నేను ఆల్ రౌండర్‌ని', 'వాడెప్పుడూ లెవెన్త్ ప్లేయర్' వంటివి వినిపిస్తూ వుంటాయి. అలాగే ఎసి - డిసి జోకర్‌గాడు, టచ్‌లు లేక, తురుపుముక్క (కుంబ్లే తురుపుముక్క) వంటివి పేకాట ద్వారా వాడుకలోకి వచ్చాయి.

సినిమాల ద్వారా కొత్త పదబంధాలు ప్రచారంలోకి వస్తున్నాయి. పూర్వం 'ముత్యాల ముగ్గు అనేది సినిమా ద్వారా బాగా ప్రచారమైంది 'డబ్బాకొట్టడం అనే అర్థంలో అది వాడబడింది. అందులో వాడిన 'డిక్కీలో తోస్తాను' లాగా మరోసినిమాలోని 'స్పాట్ పెడతాను' అనేది నానుడి

అయింది. ఈమధ్య రఫ్ ఆడించేస్తాను, లేపేస్తాను, టాప్ లేచిపోద్ది, అదిరింది, నాతో పెట్టుకోకు, గేమ్స్‌లాడకు, ఓ లుక్ ఇచ్చుకో, అంత సీను లేదు, అంతొద్దు - ఇది చాలు, ఐరన్ లెగ్ మొదలైనవి బాగా వాడుకలోకి వచ్చేశాయి. ఎంత సేపు వాయిస్తాడో, వాడు పంచాంగం విప్పుతాడు, సుత్తి వీరుడు, మటాష్ అయిపోవల్సిందే, వాడు ముదురు, జాగ్రత్త, చిరిగిపోతుంది - అనటం వినేవుంటారు. ఆఫీసుల్లో డబ్బులు ముట్టకపోతే 'కొర్రీలు' వెయ్యటం మామూలే గదా! (కొర్రీ అంటే అసలు ప్రశ్న అని అర్థం). మెల్లగా జారుకొనేవారు, డుమ్మాకొట్టేవారూ లేరంటారా?

'ఏంటోయ్ కిరికిరి చేస్తుండవు' అంటే 'ఔట్' అవల్సిందే! 'పట్లు' వుంటే పేరు రాదూమరి? 'సైడు వెయ్యటం' స్టూడెంట్ కుర్రోళ్ళ నైజం. అధికారం, డబ్బు వుంటే 'చక్రం' తిప్పేస్తారు! 'వాడికి డబ్బిచ్చావో, 'అంతే సంగతులు' అని సలహా ఇస్తుంటారు. కొందరు చేస్తున్న పనికి 'జనగణమన' పాడతారు. మందుల్లో ఇంగ్లీషు మందులున్నాయి - తెలుగు మందులున్నాయి. అసలు మందు భాయీలు వేరు. మందుబాగా తాగేవాడికి 'మందుడు' (మూర్ఖుడు) గా నిక్ నేమ్ తగిలిస్తారు. తెలుగు పదాలకి ఎబ్రివేషన్లు వుంటాయి. హోటల్‌కి వెళ్ళి ఎవడి డబ్బులు వాళ్ళే ఇవ్వటాన్ని 'ఎ.డి.వి.డి.' గా కొందరంటారు. 'పి.వి.పి.' ని ప్రజల వద్దకు పాలనగా వాడుతున్నారు.

'పప్పన్నం పెట్టవా?' అంటే పెళ్ళి ఎప్పుడు అని అర్థం. కొందరికి 'పిరికి మందు' పోస్తారు. పత్రికలవాళ్ళకి 'బుట్ట దాఖలు' చెయ్యటం సరదా! గైర్ హాజర్లూ, ఫ్రెంచి లీవులూ ఉద్యోగస్థులకి అలవాటే! పైకి కబుర్లు చెప్పి 'మొండి చెయ్యి' చూపిస్తారు! ఎంత బాగా చదివినా పరీక్ష సున్న చుడుతుంది! చిరంజీవి అంటే పడిచస్తారు! గడ్డి తినే అధికార్లు ఎంతమందో! చెప్పకుండా 'చెక్కెయ్యటం' హక్కుగా మారింది! పైవాడు కింద వాళ్ళమీద సవారీ చెయ్యడా?

రంగులు కూడా భావవ్యక్తీకరణలో స్థానం సంపాదించటం పూర్వం నుంచి వున్నదే. కాని, ఇటీవల ఇంగ్లీషు పదాల్ని తెలుగు లోకి అనువదించటంతో

ఇది ఎక్కువయింది. నల్ల బజారు, (చీకటి బజారు), బ్లాక్ డే, బ్లాక్ బాడ్జీలూ శ్వేత పత్రాలూ, ఎర్ర త్రికోణాలూ, రెడ్ శాల్యూట్‌లూ, నీలి వార్తలూ, నీలి విప్లవాలూ, బ్లూ ఫిల్ములూ, హరిత విప్లవాలూ, ఎల్లో జర్నలిజాలూ, వైట్ ఎలిఫెంటులూ, బ్లాక్ మెయిలింగూ, బ్లాక్ బెల్ట్‌లూ ఎక్కువైపోయాయిగదా!

ఇంగ్లీషు పదాన్ని అనువదించుకొని 'నల్ల బల్ల' గా చేసుకున్నాం. 'అగ్గి పెట్టె' గా మార్చుకున్నాం. ఈజీ ఛైర్‌ని పడక కుర్చీ చేశాం. 'ఇంజక్షను' కాస్తా 'సూది మందు' అయింది. ఫ్లోర్ మిల్లు పిండి మిల్లు అయింది. కిలో రాళ్ళు వచ్చినా 'మైలు రాయి'ని వదలలేదు. 'రుబ్బింగ్ మిషన్లు' కూడా వచ్చేశాయి! హవాలాగాళ్ళూ స్కాము వీరులూ, లీకేశ్వరులూ బయట పడుతున్నారు.

## 'తిట్లు' మాత్రం తక్కువా?

మానవుడికి కోపం, ద్వేషం, అసూయ, అసహనం, ఆవేశం సహజగుణాలు. వీటిల్లో ఒకటైనా లేని మానవుడు వుండడని చెప్పవచ్చు. ఈ గుణాలున్నప్పుడు, వీటికి తోడు అధికారం, సంపదలు ఉన్నప్పుడు తిట్ల పురాణం మొదలవుతుంది. దర్పం, అహంకారం, సుపీరియారిటీ కాంప్లెక్స్‌లవల్ల కూడా 'దూషణ' తప్పదు! తిట్లు తిట్టడాన్ని సంస్కృతం మాట్లాడుతున్నాడు, అచ్చ తెలుగు మాట్లాడుతున్నాడు అనికూడా అనటం వుంది. తిట్లవల్ల కొందరికి బుద్ధి రావచ్చు. మరి కొందరు సంస్కారాన్ని కోల్పోయి శత్రువులు కావచ్చు. ఇష్టమైనవాళ్ళు, కావలసినవాళ్ళు, పెద్దవాళ్ళు తిట్టినా కొందరికి ఇష్టమే. ఒంటరిగా తిట్లు తింటే పరవాలేదు - నలుగురిలో అయితే రెచ్చిపోతాడు. కొందరికి 'తిట్టు' ఊత పదంగా వుంటుంది. అది ఒక్కొక్కసారి కొంపదీస్తుంది. ఎక్కడో ఒకరో ఇద్దరో తిట్టిన పాపాన పోరు. తిట్లు తిట్టడం కొందరికి అలవాటైతే - తిట్లు తినడం కొందరి హాబీ! ఈ తిట్లలో మగవారి తిట్లు, ఆడవారి తిట్లు, కుర్రాళ్ళ తిట్లు, చిన్న పిల్లల తిట్లు, భార్యాభర్తల తిట్లు, చదువుకున్నవాళ్ళ తిట్లు, నిరక్షరాస్యుల తిట్లు, కులాల తిట్లు, వృత్తుల తిట్లు ... ఇలా ఎన్నో రకాలున్నాయి

'నీకేమొచ్చింది రోగం?', 'ఏడిశావ్‌లే', 'నోర్మూయ్', 'వెధవా', 'నీ కొంప కూల', 'నీ నోరు పడ', వంటివి ఒక మోస్తరు తిట్లు. అంటే సాధువులన్నమాట. 'నీ యమ్మ', 'నీకు శ్రాద్ధం పెట్ట', 'నీ తాడు తెగ', 'నీ సిగ తరగా', 'కొజ్జా వెధవా', 'దొంగ నాయాల', అనేవి కొంచెం దురుసుగా వుంటాయి. లంజ, లంజ కొడకా, దొంగ ముండ, భాంచెత్, రంకు ముండ వంటి బూతు పురాణానికి సంబంధించినవి చాలా వుంటాయి. ఒక వర్గం వాళ్ళు విషయించు, గీర్వాణం, బ్రష్టుడా, అప్రాచ్యుడా శష్పం వంటి సంస్కృత మాటల్ని వాడతారు. ప్రాంతాన్ని బట్టి నీ పుట్టి మునగ, నీబండబడ, నీ బొంద, ఎదవ నా బట్ట, ఏబ్రాసిగాడు, నీ జిమ్మడ, పింజారి, దగుల్బాజీ వంటివి వినబడతాయి. 'చావు' అంటే అందరికీ భయమే అయినా 'చచ్చావు', 'చావు', 'చస్తే పీడ వదులుతుంది' అని తిట్టడం మానం. బద్మాష్, రాస్కెల్, బేవర్సుగాడు, బ్లడీ, కుత్తే వంటి ఇతర భాషా పదాలు కూడా తెలుగువాళ్ళు వదలటంలేదు!

## పత్రికల భాష వేరు!

'ఈనాడు' పత్రిక వచ్చినప్పటినుంచి పత్రికల భాషలో మార్పులు మొదలయ్యాయి. ప్రజల్ని ఆకర్షించేలా, ప్రజలకి సులభంగా, శక్తివంతంగా అందేలా కొత్త పదాలూ, పద బంధాలూ ఏర్పడుతున్నాయి. కవితా మయంగా, ఆలంకారికంగా, విశిష్టంగా వార్తలు అందించాలన్న తపన కనిపిస్తుంది. 'ఈనాడు' నుంచి ఇది నేడు దాదాపు అన్ని పత్రికలకి వ్యాపించింది.

అంగరంగ వైభవం, కార్యాలయం ఫైళ్ళు, కాగితం కథ, కాంగీ, కాషాయం బేజారు, హుటాహుటి, ఇదలా వుండగా, నయా జమానా, గోల్ మాల్, నిష్పూచీరాయుళ్ళు, కాంగ్రేసేతర, పాస్ పుస్తకాలు, లాకప్ మరణం, బూటకపు ఎన్‌కౌంటర్ మొదలైన ప్రయోగాలు కనిపిస్తాయి.

రన్నింగ్ కామెంటరీ, సన్నీ కాలమ్, స్టైల్, ఇన్‌ఫార్మర్, జాయింట్ ఏక్షన్ కమిటీ, సెమీ ఫైనల్స్ ఎన్.ఎం.ఆర్ మొదలైనవి కేవలం ఇంగ్లిషు పదాలే. ఇటీవల 'రాస్తా రోకో' 'ధర్నా', 'లాఠీ చార్జి', 'జైల్ భరో' 'ఛలో

హైదరాబాద్, 'జులుం', 'ఘోరావో'లు బాగా ఎక్కువయ్యాయి. రష్యాలో కమ్యూనిజం పతనమైనప్పుడు ఒక పత్రికలో సంపాదకీయానికి 'దస్వీదానియా' అనే శీర్షిక వుంది. అది రష్యన్ పదం. 'వీడ్కోలు' అని దాని అర్థం. 'సారాజులు' వంటి కొత్తపదాలు తయారు చేస్తున్నారు. మద్య పాన నిషేధం సడలింపుపై ఒక పత్రిక 'మళ్ళీ గ్లాసుల గలగలలు' అంటే మరో పత్రికలో 'ఇకనుంచీ ఛీర్స్' అని సందర్భశుద్ధిగా రాశాయి. ఈనాడు, వార్త భాష లపై పుస్తకమే వచ్చింది జర్నలిజం భాషగురించి చాలా పుస్తకాలు వచ్చాయి. చాలామంది పరిశీలించారు. ఈ క్రింది వాక్యాలు ఒక పరిశీలనా వ్యాసం లోవి -

రగిలిన రాజకీయవేడి.

'చేతి' లో గ్రూపులు - నేతలేని సైకిలు.

లక్షల ఎరతో కోట్లకు గాలం.

ములాయం కోటలో సంకులసమరం.

లల్లూతోటలో అద్వాని హోరు.

యువత చేతిలో నేతల రాత.

క్షణం క్షణం ఇక ఎలక్షణం.

రాజీవ్ పై హోరు - బిజేపీతో పోరు.

మార్కెట్టులో మతలబులు.

చర్చలకు గండి కొట్టిన ఫ్రంట్.

కొన్ని వార్తలు ఒక కథలాగా, సస్పెన్సుతో, వుంటాయి. కవిత్వం సరేసరి. అందుకు ఓ ఉదాహరణ -

చర్చలు విఫలం, ఇక తప్పదు యుద్ధం.

జరగకూడనిదే జరిగింది. ప్రభుత్వం ఉద్యోగులు పరస్పరం విశ్వాసం కోల్పోయారు. గోదాలోకి దిగి ద్వంద్వ యుద్ధానికి తలపడ్డారు. ఉద్యోగులు నిరవధిక సమ్మెను ఆయుధంగా స్వీకరించారు సంక్షేమ కార్యక్రమాలు లేగ దూడల్లా వణికి పోతున్నాయి. జూలై 15 అర్ధరాత్రి యుద్ధభేరి మ్రోగనున్నది. అదివేలాది ఉద్యోగుల గొంతుకలలో ప్రతిధ్వనించనున్నదో, ప్రజల నిరసనలతో పేలవం కానున్నదో!

మరికొన్ని వార్తా కథనాలు మంచి శీర్షికలతో వెలువడుతాయి. ఆ శీర్షికలు ఆకర్షిస్తాయి. పాఠకుల్లో ఉత్సుకతనీ, ఉత్కంఠనీ కలిగిస్తాయి. అటువంటి శీర్షికల్లో కొన్ని -

బోర్డుచూసి మోసపోకుమా!

అక్కడ 'అది' మామూలే!

దొరికిన బందిపోటు స్వాములు.

ఈ రు.20 అక్షలు ఎవరివి? విడుదలకై దేనికి తహతహ?

విప్లవభూమిలో అహింస ప్రవక్త.

## ఇక ఉత్తరాల కథ!

లేఖా రచన అనేది పూర్వకాలంనుంచి ఉన్నదే. రాజులు కూడా లేఖలు రాసేవారు. లేఖలు అనగానే 'ప్రేమలేఖలు' గుర్తొస్తాయి. రకరకాల లేఖలున్నాయి - రాజకీయనాయకుల లేఖలు, సాహిత్య లేఖలు, కుటుంబ సంబంధమైన లేఖలు, వ్యాపార లేఖలు, పరిపాలనా పరమైన లేఖలు, సాంఘిక లేఖలు, పత్రికా లేఖలు, శుభలేఖలు మొదలైనవి.

పూజ్యులైన, మహారాజశ్రీ, మాన్యశ్రీ, గౌరవనీయులైన, పెద్దలు మొదలైనవి గౌరవంగా 'పిలుపు' లో వాడతారు. రాజరికం లేకపోయినా 'మహారాజశ్రీ' మనల్ని వదలలేదు. ఇవి కాక వివిధ సందర్భాలలో, ప్రియమైన, ఆర్యా, మహాశయా, అయ్యా, అమ్మా, డియర్ మొదలైనవి ఉన్నాయి. కొన్ని ఉత్తరాలకి చివర కొందరు 'పి.యస్' అని ముగించిన తర్వాత మరో అంశం గుర్తుకువచ్చి రాస్తారు. లేదా ఉత్తరంలో చెప్పలేని అదనపు ప్రత్యేకమైన అంశాల్ని తెలియజేస్తారు. పి.ఎస్. అంటే పోస్టు స్క్రిప్ట్ అని అర్థం. దీన్ని చాలామంది తెలుగులో 'తాజాకలం' అన్నారు. ఉత్తరాలలో వ్యక్తిత్వం, సంస్కారం, విజ్ఞానం, వినోదం, కవిత్వం, మానవ సంబంధాలు, లోకజ్ఞత ఇమిడివుంటాయి. కానీ దురదృష్టం ఏమిటంటే ఇప్పుడు 'ఫోన్లు' వచ్చి ఉత్తరాలను రాసే అలవాటును పోగొడుతున్నాయి. వివిధరకాల ఉత్తరాలను గమనించండి:

''మహారాజశ్రీ సి.పి.బ్రౌన్ దొరవారి సముఖానకు రాజుగారి శ్రీమవిరతని తాలూకాలో చేరిన మావండూరు అగ్రహారంలో వుండే ముడుంబి శేషాచార్యులు అనేక సలాములు చేసి వ్రాసుకున్న విన్నపము యేమంటే మీరు కాకితములలో తెలుగు ప్రతులు వ్రాయిస్తూ అమూలకముగా బహుమంది జీవనము నడిపిస్తున్నారని అనేకులవల్ల తెలిసినది. ఈకాగితములో వ్రాసి వుండే అక్షరములు నేను స్వతహాగా వ్రాశినవి. యీ అక్షరములు తాము కటాక్షించి చూచి నేను నిండారిక్తుణ్ణే గనుక, నాకు జీవనము నడిపించే భారము తమదేగాని, యితరమునాకు యెవరూలేరు'

* * *

''మీరడ్వాన్సుగా బదిరూపాయిలు బంపినందులకు బెక్కువందనములు. డబ్బు నాకు చాలా అవసరముగనున్న సమయమున ఈ సొమ్ము నాకు చేరినది. నాకు గలస్వల్ప ధనమునేనిచ్చుటి వితంతు శరణాలయమున కిచ్చినాను. సంవత్సరము తర్వాత సంవత్సరముగా నా ఆరోగ్యము పాడైపోవుచున్నది. నాకు మునుపటి సత్తువలేదు. ఏ మాత్రముపని చేసినను నాకాయాసము కొంత కాలమునకే కలుగుచున్నది. కడచిన కృష్ణామండల సాంఘిక సభాధ్యక్ష పదవి (1902) నేనేమియు నుపన్యసించనక్కరలేదను షరతు మీదనే నేనంగీకరించితిని. కాని నాయుపన్యాసము వినుటకే చాలమంది ఆనాడు సమావేశమగుట చూచి నాదృఢ సంకల్పమునకు వ్యతిరేకముగా నొకగంటకు పైగా నేనుపన్యసించితిని'' (కందుకూరి వీరేశలింగము)

* * *

''శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి గారి ఉషానాటకం గురించే కదూ, ఆమధ్యనే నే నీ నాటకం చదివాను.......అది ఎందుకూ కొరగాని పుస్తకం. శ్రీ వేంకటరాయశాస్త్రి గారు బొత్తిగా పసిపిల్లల మనో భావాలు కలవారని కాని, సహజవిలక్షణ భావశక్తి లోపించిన వారనికాని, నేనెన్నడూ అనుకోలేదు. ఒక అంకం ఉషావిరహం. మరొక అంకం ప్రద్యుమ్న విరహం. శైలి చూతామంటే పాతఫక్కీ, తలనొప్పి. చికాకు. అన్ని పాత సంప్రదాయాలే!

అంతాకన్వేక్షన్మయం. తామర ఆకులు, సెజ్జులు, చంద్రకిరణ తాపం, విరహవేదన అన్నీని. లేనివేంలేవు. పాత్రౌచిత్యంలేదు. కదలికాలేదు. పాత్రచిత్రణాలేదు...శృంగార ఘట్టాలు చదవటానికి అసహ్యామే, వినడానికి రోతే. వొట్టి అశ్లీలమే తప్ప మరేమీ కనిపించదు. శాస్త్రిగారు 'బఫూనరీ'నే హాస్యచమత్కారాలనుకున్నారనుకుంటున్నాను.'' (గురజాడ)

* * *

''మీ జాబు చూచి మీ అద్భుతోత్సాహమును గమనించగా మాకు సంతోషమైనది. మన నెల్లూరు మిత్రులు కొంచెము మందగించు చున్నారను మాట వాస్తవముగా విచారదాయకమై యున్నది. కాని మన మహాసభ ఉత్సాహమునకిది ప్రతిక్రియని నా ఊహ. రెడ్లు గౌరవస్తులు. మాట మీద నిలిచెడువారు నయినందు చేత నేను నిరాశ చెందుట లేదు. నా యీ నమ్మకమును మార్చుకొనుటకు అగత్యమేమీ కనిపించలేదు. ఉత్సాహవంతులైన మీబోటి వారున్నయెడల, మనవుద్యమము మొక్కవోదని నానిశ్చయము'' (సి.ఆర్.రెడ్డి)

* * *

''ఆరెండు దినాలు ఘడియలూ యీ అనంత విశ్వస్మరణలో కరిగిపోయి కనబడవేమోనని, అట్లా అక్షరాలలో శాశ్వతంచేసి మీ పాదాలముందు - ఆ ఉదయాన - మీ కరణామయమైన పాదాల అర్పిస్తున్నాను.

నేను అసహాయుణ్ణి. నేను నా స్వాధీనంలో లేను. మీప్రేమ నాకు గతి, అసలు కల్పించి విరహానికి వొప్పజెప్పవద్దు - అని వ్రాయడం నాకు భయం. మూసిన వాకిలి వద్ద భిక్షమడగడం నాచాతగాదు. అర్ధరాత్రి వేదన ఆపలేక అరచిన నాకంఠంవిని, కిటికీ తెరచి దీపం వేసి నా వంక తొంగి చూశారను కున్నాను. అబద్ధమా, పోనీండి. ఈ నిర్భాగ్యజీవి జాలివల్ల శాంతిపొందడు. జీవితమంతానిరాశాస్వప్నాలతో నవ్వుతాడు....... మళ్ళీ మిమ్మల్ని ఎప్పుడు చూడగలను. చాల దూరదేశం వొచ్చేశాను. .....'' (చలం)

* * *

జలసూత్రం-

క్షమించాల్సిందెవరూ? నువ్వా? నేనా? నాతప్పంతా నీనెత్తిన వేసుకొని నన్ను క్షమాపణ కోరవస్తావా? అయితే నేనే నువ్వన్న అద్వైతంలోని విశిష్టాద్వైతం కావచ్చు...... ఇది.

ఏది వ్రాసినా **insincerity** అనే అనుమానిస్తుంది ఈలోకం. ఏమి చేసినా ఏదో ప్రయోజనం మనస్సులో పెట్టుకొని చేస్తుందంటుంది.

కళ కోసమే కళ అంటే నమ్ముతుందా? ప్రజ కోసమే కళ అని నమ్ముతూకూడా అవిరుద్ధంగా ఇప్పటికీ నా మొదటి వలపు **art for art's sake** ను వదలలేను. ఎందుకొచ్చిన గొడవని ఒకప్పుడు విసుక్కుంటాము గుంపులో చేరిపోదాం అనుకుంటాము. కాని చేరనిస్తుందా పురుగు? ఈవిధంగా నేను 'బాగుపడే' అవకాశం ఒకటి వచ్చి తప్పి పోయింది. అందుకిప్పుడు సంతోషిస్తున్నాను. నీకు దారిద్ర్యం వదలింది. అంతే, స్నేహితుల్లో పడ్డావు. నిజమే, సుఖిస్తానంటావా? మొదట నీలోని కవిని సంహరించుకో.

'కవికి సుఖంలేదు' నేను ఉపదేశం పొందిన మంత్రం అది. శ్రీనాథుడు సుఖపడ్డాడంటే నమ్మను. టాకూరు జమీందారు సుఖపడ్డాడంటే నమ్ము (శ్రీశ్రీ-1939లో)

* * *

శ్రీరస్తు-చిరంజీవిని తల్లికి -

ప్రేమ పూర్వక నారాయణ స్మరణముతో ఆశీర్వదించి: ఉభయకుశలోపరి: ప్రియమైన తల్లీ!

నీ లేఖ అందింది. విషయాలన్నీ అర్థం చేసుకున్నాను. మానవుడు ఏమిచెప్పగలడు తల్లీ! తమ ప్రారబ్ధ కర్మ వెంటరాగా ఈలోకంలోకి వస్తున్నారు ప్రతివారూ. ప్రారబ్ధ కర్మను ఎవరూ - చతుర్ముఖ బ్రహ్మపర్యంతం-తప్పించుకొనలేరు. జీవునికి మానవ జన్మ కలిగింది కేవలం

మోక్ష సంపాదన కొరకే. ప్రపంచంలో దుఃఖం ఎక్కడుంది? ఈ జగత్తు అశాశ్వతమైంది. అమ్మా! దుఃఖించకు. దుఃఖాన్ని మరచిపో! నేను చాలా తొందరపనుల్లో ఉండికూడా నీ దుఃఖాన్ని చూడలేక రాశాను.....'' (యతీంద్రులవారు)

* * *

నారాయణ రావ్ & బ్రదర్స్
బట్టలవ్యాపారం
చిన్నబజారు, నెల్లూరు.

మహాశయులారా!

మీ దగ్గర లభించే నాణ్యమైన బట్టలకు సంబంధించిన వివరణలతో కూడిన ధరల పట్టీని మాకు త్వరగా పంపండి. మీరిచ్చే కమీషన్ వివరాలను గూడా తెలపండి.

మీరు ప్రకటించిన ధరలూ, కమీషన్ షరతులూ మాకు అందుబాటులో వుంటే మేము వెంటనే ఆర్డర్లు పంపుతాము.

భవదీయుడు,

..............

స్వస్తిశ్రీ చాంద్రమాన శ్రీయువనామ సంవత్సరమార్గ శీర్ష శుద్ధ ద్వాదశీ భానువారం (అనగా 3.12.1995 ఆదివారం) రాత్రి గం.9.02 ని లకు తత్కాల అశ్వనీ నక్షత్రయుక్త కర్కాటక లగ్నమందు-

చి। నాగేశ్వరశాస్త్రి కుమార్తె

చి॥సౌ సునీతను

అమలాపురం వాస్తవ్యులు డాక్టర్ కొత్త పల్లి ఘనశ్యామల ప్రసాదరావు బావగారి ద్వితీయ కుమారుడు

చి ప్రభాకర్ కు

ఇచ్చి - అమలాపురం - కూచిమంచి వారి అగ్రహారంలో ''శ్రీ సత్యసాయి కల్యాణ మండపం''లో వివాహము జరిపించుటకు దైవజ్ఞులు నిశ్చయించిరి కావున ఏ తత్ శుభముహూర్తమునకు మీరు బంధుమిత్ర సపరివారముగా విచ్చేసి, వధూవరులను ఆశీర్వదించి మదర్పిత చందన తాంబూలాదులు స్వీకరించవలసినదిగా గోరుచున్నాము

మంగళం మహత్

శ్రీ శ్రీ శ్రీ

* * *

1-9-1983 గురువారం
సాయంత్రం 6.30గం
ప్రెస్ క్లబ్ (బషీర్‌బాగ్) లో
మాపెళ్ళి....... .

మీ సన్నిధి మాకు పెన్నిధి
మీ ఆశీస్సులు మాభావికి దీపాలు
మీ అభినందనలు
అవిశ్రాంత వసంత సంకేతాలు

-శాంతిగోస్.

* * *

రీడర్ ద్వానా శాస్త్రి ఎమ్.ఏ., పిహెచ్.డి అమలాపురం గారికి -

ఆర్యా!

వందనంబులు - ఉభయకుశలోపరి.

మీరు రీడర్ అయినట్టున్నా శ్రీ పతంజలి శాస్త్రిగారు దానికి ఆనందించి దుఃఖిం... .....తప్పు తప్పు-అభినందించినట్టున్నా యావల్లేఖా

వివరాలు నాకు తెలుసు. నేనూ అదేమాదిరిగా చాలాచాలా ఇది అయ్యాను. రాజమండ్రానికి రండి - చెబుతాం. కొత్త ఇల్లు - సద్వితీయంగా రండి. బొమ్మూరు సెంటర్‌లో దిగి కిళ్ళీ కొట్లో అడగండి.

పరీక్షకుల జాబితాలోకి ఎక్కుతారు - తప్పుద్దామరి -

- (బేతవోలు రామబ్రహ్మం)

* * *

## రాసేటప్పుడు వాడే గుర్తులు గురించి కొంత...

మనం రాసేటప్పుడు భావాన్నిబట్టి, సందర్భాన్ని బట్టి, విషయాన్ని బట్టి కొన్ని గుర్తులు వాడతాం. ఇంగ్లీషు భాషనుంచి కొన్ని గుర్తులు వచ్చాయి. వీటిని 'విరామ చిహ్నాలు' అంటున్నారు. ఫుల్‌స్టాప్, కామా, డాష్, కోలన్, కిందిగీత (అండర్‌లైన్), సెమికోలన్, డిటో, ఆబ్లిక్, కోటేషన్ గుర్తులు, ప్రశ్న, ఆశ్చర్యార్థకం, బ్రాకెట్, మీసాల బ్రాకెట్, చుక్కలు మొదలైన లేఖన చిహ్నాలు ఎలా ఎప్పుడు వాడతామో ఈ కింది వాక్యాలు తెలుపుతాయి

*ఆమె బాగా పాడుతోంది.

*ఆమె బాగాపాడుతోంది గానీ, జనం లేరు.

*కా.రా. (కాళీపట్నం రామారావు).

*ఆమె బాగాపాడుతోందా ?

*ఆమె బాగానే పాడుతోందే!

*మిత్రమా, నమస్కారం.

*జీవితేచ్ఛలేకపోతే సృష్టిలేదు; స్థితి లేదు; లయంలేదు.

*భారత్ - ఫ్రాన్స్‌ల చర్చలు.

*కన్యాశుల్కం - మహత్తరమైన సాంఘిక నాటకం - 1897 లోనే వచ్చింది.

*అమ్మో! కొంపమునిగిందిరో! ఎంత దారుణం!

*'నాకు సినిమాలంటే మంట' అన్నాడు.

*రేఖాగణితం (geometry); రు.400 (అక్షరాలా నాలుగువందలు).
*'నేను చదవలేదు, కానీ ...'
*'శ్రీరాముని దయచేతను...' అనే పద్యం వచ్చా?
*అమలాపురం
10.04.'97.
*నేను విజయవాడ / హైదరాబాదు వెళ్ళాలి.
*రామయ్యకి రు.400 ఇచ్చాను.
*సీతయ్యకి రు.400 ఇచ్చాను.

## 'ప్రకటన'ల పంగతి చూద్దాం!

ప్రకటనల్లో (అడ్వర్‌టైజ్‌మెంట్లు) ఎక్కువగా వ్యాపారానికి సంబంధించినవే వుంటాయి. అయితే సినిమాల ప్రకటనలు, సాహిత్య ప్రకటనలూ లేకపోలేదు. సూక్ష్మంగా మూడు నాలుగు ప్రకటనలు చూద్దాం.

'మాతృదేవోభవ! ఈ భారతదేశం అహల్య, అనసూయ, సీత, సావిత్రి, దమయంతి, ద్రౌపది, గాంధారి మున్నగు పతివ్రతలకును, గార్గి మైత్రేయ మున్నగు వేదాంత శాస్త్ర కోవిదులకును, పద్మిని, జిజియా బాయి, అహల్యాబాయి, ఝాన్సీలక్ష్మీబాయి మున్నగు వీరవనితలకును, అవ్వయ్యార్, మీరాబాయి మున్నగు భక్తాగ్రగణ్యులకును పుట్టినిల్లు.

ఇట్టి వనితామతల్లి - పరమపూజనీయ - స్త్రీల పాలిటి వరప్రసాదిని - విటా అశోక! ఋతు దోషముల హరించు మంచి జీర్ణశక్తినిచ్చు - గొప్పటానిక్కు.' (1957)

* * *

న్యూటోన్ స్టూడియో వారి 'వందేమాతరమ్!'
నటీనటులు: నాగయ్య, కాంచనమాల మొ వారు.
స్త్రీ దేవతా మూర్తి - త్యాగమూర్తి.

ఆమె హృదయము - భూకంపము.

ఆమె త్యాగము - లోకానందదాయకము.

ఇది కలియుగ రామాయణము. (1939).

* * *

దసరా తగ్గింపు ధరలు!

సగానికి సగం! త్వరపడండి!

కొండకొలకు వికసితోత్పల శీర్షిక.

కవి: కవికొండల వెంకటరావు.

మొత్తముగా తొమ్మిదింటికి కలిపి, ఆర్డరు ఇచ్చువారికి రు.1.8.0. మాత్రమే. రు. 1.8.0. ముందుగా మనియార్డరు చేయుచో తపాలాఖర్చులు తగలవు.

* * *

అమృతాంజనము

నా మార్గదర్శి, నా వైద్యుడు, నా స్నేహితుడు.

బాధలనే రాక్షసులను సంహరించుటకై ఉద్భవించిన అవతారము.

* * *

షణ్ముగం నశ్యము

షణ్ముగ నశ్యము దేశమునకు చేసిన జాతీయ సేవ అపారమైనది. మీకు కూడ సేవ చేయుటకై షణ్ముగనశ్యమునకు అవకాశమునిచ్చెదరా!

గాయకులు తమ పనులు మిక్కిలి ఉత్సాహముతోను, రమ్యముగాను నిర్వహించగలరు. గుమాస్తాలు చురుకుగాను, త్వరితముగాను వారి పనుల నెరవేర్చగలరు. అనేకగంటల కాలము పని చేయు ఉపాధ్యాయునికి శక్తి నిచ్చును. న్యాయాధిపతికి నిర్మలమైనట్టి రమ్యమైన మనస్సును కలిగించును.

* * *

గరిమెళ్ళ - వీరికి సహాయం చేయండి!

వీరు చాలాకాలం ఆంధ్రప్రభలో శ్రీ న్యాపతి నారాయణమూర్తి గారి

వద్ద సహాయ సంపాదకునిగా పని చేశారు. ఈ రోజు నిరాధారంగా వున్నారు. పాపము ఈ మధ్యనే వీరికి పూర్తిగా దృష్టి పోయినది. తనకు చేదోడు వాదోడుగా నుండి ధనమార్జిస్తున్న సోదరుడు అకాల మృత్యువు వాత పడినాడు. అది జరిగి ఎన్ని నాళ్ళో కాలేదు. గత నెల 22వ తేదీనాడు వీరి గృహిణి పరలోకప్రాప్తి చెందినది. 10, 6 సంవత్సరములు వయస్సులో నున్న ఇద్దరి పిల్లన్ని పోషించి పెద్ద వారిని చేయవలసిన బాధ్యత వీరి యందుంది. ఉదారవంతులు, మిత్రులు సహాయం చేయప్రార్థన.'

(జీతీయ కవి గరిమెళ్ళ సత్యనారాయణగారి చివరి రోజులు గురించిన ఈ ప్రకటన 1946 మే నాటి 'పెంకిపిల్ల' అనే పత్రికలో ప్రచురింపబడింది)

* * *

కొత్త 165 లీటర్ల స్టెర్లింగ్ సుప్రీం ఎందుచేత మీ కొత్త ఇంటికి అతికినట్టు సరిపోతుంది?'

'దీనిని మీ అత్తగారు డిజైన్ చేశారని చెబితే సరిపోతుంది.'

* * *

కుటుంబమంతటికీ గొప్ప వాత్సల్య సబ్బు.

* * *

బాధనివారణ కోసం ప్రాకృతిక ఔషధ చికిత్స.

* * *

దీపావళి కాంతుల తళతళలు, రంగుల రవళులు
ఆష్టానికాలో మాత్రమే అనుభవించండి.

* * *

అది విస్తారమైన, ఆనందనిలయమైన అంతర్జాతీయ కుటుంబమయిన - కెల్వినేటర్ కుటుంబములో ఒక భాగం అయ్యేందుకు మీరు వేసే తొలి అడుగు.

* * *

ఉషా ఇప్పుడే కొనండి ...

కపిల్‌తో బాటు ఒక సాయంత్రం గడిపే బహుమతి గెలవండి.

* * *

ఎక్కడైతే గాలి కావాలని మీరు అనుకుంటారో అక్కడే ఉంటుంది ఖేతాన్.

* * *

## తెలుగు వచనంలో ఎన్నోరకాలు....!

నన్నయకి ముందునుంచి ఇప్పటి దాకా తెలుగు వచనంలో ఎన్నెన్నో రకాలు కనిపిస్తాయి. గ్రాంథికం, వ్యావహారికం అనే భేదాలున్నాయి. ప్రాంతాన్ని బట్టి, భేదాలున్నాయి. సాహిత్య రచన వేరు - లేఖారచన వేరు. నాటకం, కథ, వ్యాసం మొదలైన ప్రక్రియలను బట్టి రచన వేర్వేరుగా వుంటుంది. కాలాన్ని బట్టి భాష మారటం వల్ల రచనలో మార్పు కనిపిస్తుంది. రచయితని బట్టి - **style is the Man** అన్నట్టు రచన - మారుతుంది. ఇలా అనేక రకాలుగా వున్న తెలుగు రచన నుంచి కొన్ని మాత్రమే ఇక్కడ ఉదాహరిస్తాను:

'చెన్న పట్టణములో నేను వుండగా కొందరు ఫరంగి వాండ్లతో మతాను సారములయిన మాటలు మాట్లాడుచునుండగా యిదేరీతిగానే డిష్టయిని **(Destiny)** అనే విధి బలమయినప్పుడు ఈశ్వర కటాక్షమేమి పనికి వస్తున్నదని ప్రస్తాపము వచ్చెను. అప్పుడు నాకు తోచిన బుద్ధి ప్రకారము నేను సమర్ధించిన వయిన మేమంటే డిష్టయిని అనేవిధిని మదరాసు సూప్రీం కోర్టుగా భావించవలసిన దనిన్ని యీశ్వరుని సీమరాజుగా భావించ వలసినదనిన్ని; యెట్లా సీమరాజుయొక్క ఆజ్ఞ వల్ల లోకులు చేసే తప్పుకు సూప్రీంకోర్టువారు తూకు (ఉరి) తీయగలరో తద్వత్తుగా డిష్టయిని అనేవిధి కర్మపలానుభవమునిచ్చినా సీమ రాజుతో రూపు రూపుగా చెన్నపట్టణములో నుంచి యెవరికయినా జాబులు నడుస్తూ వుండే పాటి విహితయుండి తనకు తూకున తీసేటట్టు సుప్రీంకోర్టు వల్ల కలిగిన ఆజ్ఞకు సీమరాజు మన్నన

నిమిత్తమై వ్రాసి పంపించి తెప్పించుకోగలిగితే యెట్లా సుప్రీం కోర్టు యొక్క దండన తప్పి పోవచ్చునో, అట్లా డిష్టయిని అనే విధి యీశ్వర కటాక్షము ముందర నిలువ నేరదని చెప్పి సమాధాన పెట్టినాను.'

(ఏనుగుల వీరాస్వామయ్యగారు రాసిన 'కాశీయాత్రాచరిత్ర' పుస్తకం నుంచి. -1938లో ప్రచురితం).

* * *

'సిరులకిరవై, చదువులకు గుదురై, యీవికిఁ దావలమై దిట్ట తనంబునకు మనికిపట్టై, నీటునకుఁజాటై, యోడుపునకు మేరయై, ప్రేముడికిఁగేమై, చల్లదనంబులకిల్లై, గోనమ్ములకిమ్మై, యెమ్మెయిం గ్రాలుచుఁ గతం బేదియు నాయెడ దర్దయుం బోరామిగారాములు నెఱపుచు వఱలు నాయనుంగు నెయ్యునకు పల్మఱు నెఱంగి యెఱుకపఱచు విన్నపంబులు.'

(అచ్చతెలుగులో నాగపూడి కుప్పుస్వామయ్య రచన - 1896లో).

* * *

'ఓం జయజయ దేవదేవ గంధర్వ సిద్ధ విద్యాధర చారణ కిన్నర కింపురుష లహంపూర్వికా సంపుల్ల పుటంబులగు చేతస్సంపుటంబులం బుటపుటనగు భక్తి విశేషంబుల శేషాహి కటక భూషా విశేషాభిరామంబులగు మీకోమల శ్రీపాద కిసలయంబు లఘు స్ఫుణమణి కోటీర కోటీ విటంక సందానిత మందార మాలికా మకరంద బిందు ధారా ధోరణీ ప్రవాహంబుల నహరహరంబును నభిషేకింతురు. కంఠేకాలా! మీ కంఠ మూలంబునఁగలువ దండకై వడిం గనుపట్టు కరాళ కాలకూట విషయుషీ కళంక పంకచ్ఛాయా చ్ఛటా గుళుచ్ఛంబు వలన నిఖిల లోక సంరక్షంబు నిగమ వ్యాఖ్యాతంబు...'

(శ్రీనాథుడు)

* * *

'ఎవ్వఁడు హంసములను శుకములను మయూరములను శుక్లహరిత చిత్రముల గావించె నా యీశ్వరుఁడా యాయి జంతువులకుఁ దత్తదను

రూపమైన వృత్తిని గల్పించినాఁడు. మూఢులీయర్థమెఱుఁగక, వృత్తికయి పడరాని పాట్లు పడి కాలము వ్యర్థముగాఁ బోగొట్టు చున్నారు. విత్తము గడన యందొక దుఃఖము, కాపుదల యందొక దుఃఖము, వినాశమందొక దుఃఖము పుట్టించుచున్నది. ఇట్లు దుఃఖైక మూలమైన విత్తమేల? కాల్పనా! ధర్మార్థము ధనము గోరుట కంటె నిస్పృహత్వము మంచిది. 'అడుసు ద్రొక్కనేల, కాలు కడుగ నేల?' ఆకాశమునందుఁబక్షులచేత, భూమియందు వ్యాళములచేత, జలములయందు మీల చేత మాంసము భక్షింపబడినట్లు సర్వత్ర విత్రవంతుఁడు భక్షింపబడి యెడును. కాఁబట్టి ధనతృష్ణ మానికోలు వివేక కార్యము.'

(చిన్నయసూరి)

* * *

శిష్ట జనవ్యవహారమందున్న భాష అఖిల లోకోపకారమైన గ్రంథములు రచించడమునకు చిరకాలమయి పండితులు వాడుతున్నారు. ఇది అపరిమితమైన ప్రయోజనమైనది. అపరిహార్యము. దానిని నిరసించగూడదు. దానిని అవలంబించడము సత్సంప్రదాయమునకు విరుద్ధము కాదు. ఏ దేశమందైనా శిష్టులు వాడే భాష దేశభాషగా అంగీకరిస్తారు. పతంజలి మహాభాష్యంలో అలాగుననే చెప్పినాడు. వ్యవహారిక భ్రష్టమైన పాతమాటలు వాక్యాలలో వాడకూడదని తిక్కన చెప్పినాడు. ఆంధ్రమండలమందున్న వ్యవహారములన్నీ దేశభాషలోనే జరుగవలెను. అందుకు గ్రాంథిక భాష ఉపచరించదు'

(గిడుగు రామమూర్తిపంతులు - 1935)

* * *

'డామిట్ ఇలాంటి మాటలంటే నాకు కోపం వస్తుంది ఇది బేస్ ఇన్‌గ్రాటిట్యూడ్. నాతో మాట్లాడడమే ఒక ఎడ్యుకేషన్. ఆ మాటకొస్తే నీకున్న లాంగ్వేజి నీ మాస్టరుకుంది? విడోమారేజి విషయమై, నాచ్చికొశ్చన విషయమై నీకు యెన్ని లెక్చర్లిచ్చాను! నాదగ్గర చదువుకున్నవాడు ఒహడూ

అప్రయోజకుడు కాలేదు. పూనా డక్కన్ కాలేజీలో నేను చదువుతున్నప్పుడు ది ఇలెవన్ కాజెస్ ఫర్ది డీజనరేషన్ ఆఫ్ ఇండియాను గూర్చి మూడుగంటలు వక్క బిగిన లెక్చరిచ్చేసరికి ప్రొఫెసర్లు డంగై పోయినారు. మొన్న బంగాళీ వాడు ఈ ఊళ్ళో లెక్చరిచ్చినప్పుడు ఒకడికైనా నోరుపెగిలిందీ? మనవాళ్ళు వట్టి వెధవాయలోయ్! చుట్ట నేర్పినందుకు థ్యాంక్ చెయ్యక తప్పు పట్టుతున్నావ్? చుట్ట కాల్చడం యొక్క మజా నీకింకా బోధ పడక పోవటం చాలా ఆశ్చర్యంగా వుంది. చుట్ట కాల్చబట్టే కదా దొర్లంతా గొప్ప వాళ్ళయినారు. చుట్ట కాల్చని ఇంగ్లీషు వాణ్ణి చూశావుా? చుట్ట పంపిణీ మీదనే స్టీము యంత్రము వగయిరా తెల్లవాడు కనిపెట్టాడు. లేకపోతే వాడికి పట్టుబడునా?'

('కన్యాశుల్కం' లో గురజాడ - గిరీశం)

* * *

'ఆహాహా! ఏమని? ఏమని? మనయధ్యక్ష భగవాను నియాలాప కలాపమేది? వారు సాధించిన సూక్తి యేది? వారి యాస్య గహ్వరము నుండి యవతరించిన యాగమ సూత్రమేది? చెప్పనా? ఆంధ్రుడు వచింపఁదగినది కాదే? చెప్పనా? చెప్పకతప్పునా? మనయగ్రాసనాధిపతి దేవుని కాంధ్ర భాష రాదట. ఆయన యాంధ్రమున మాటలాడనే లేరఁట. అయ్యయ్యో! ఆంధ్రమున మాటలాడలేకపోవుట యేమి? మూఁగవారు కారే - నంగి నంగి మాటలవారు కారే - మెమ్మె పెప్పె యనువారు కారే - ...మ్యావుమని కూయలేని పిల్లి యెచ్చటనయినా నుండునా? కిచకిచలాడలేని కోఁతిని మీరెచ్చటనయినఁ జూచితిరా? ఈఁత రాని కప్పయే దేశమందయినా నుండునా? పుట్టగానే క్యావుమనలేని బిడ్డ చచ్చినదనుటకేమైనా సందేహమా? ఆంధ్ర దేశమునఁబుట్టిన పక్షులైన ననవరత శ్రవణమున నాంధ్రమున మాటలాడు చుండగా - అయ్యయ్యో - మనుజుఁడే - అంతమనుజుడే - ఆంధ్రమాతాపితలకు బుట్టినవాఁడే - ఆంధ్రదేశీయవాయు నిరాహార పారణమొనర్చిన వాఁడే - అధమధమమాఱుసంవత్సరముల యీడువఱకైన నాంధ్రమున మాటలాడిన వాఁడే - అట్టి వాఁడాంగ్లేయ భాషనభ్యసించిన

మాత్రమున నిప్పుడాంధ్రమున మాటలాడ లేకుండునా? ఆశ్చర్యము. అవిశ్వసనీయము. అసత్యము. ఆంధ్రమున నాతనిని మాట లాడకుండఁజేసినది అశక్తి కాదు - అనిష్టత, అసహ్యత'

(పానుగంటి లక్ష్మీనరసింహారావు - 'సాక్షి' నుంచి)

* * *

'నాన్నా, పత్రికల రంగుటద్దాల లోంచి, స్వార్థపు చత్వారపు కళ్ళతో దేశాన్ని చూస్తున్న నీకేం తెలుస్తుంది, టైము విలువ? నేను ఒక్క క్షణం ఆగలేను. దేశం గ్గోలు గా ఉంది. లక్షలాది జనం బాధపడుతున్నారు. తిండితిప్పలయి పోయింది. మందు మాసి కాని కందుతోంది. ఇంపోర్టు పాలిసీ బాగులేదు. కారు అడిగిన రెండేళ్ళగ్గాని రాదు. పన్జైసే రేడియో బోల్డు ఖరీదు. బీదవాళ్ళు బీదబాధలూ గొప్పవాళ్ళు గొప్పబాధలూ పడుతున్నారు. దేశంలో కోడిగుడ్డు శాకాహారం స్థాయికీ, పూజ రోజు కాఫీ ఔషధం హోదాకీ పెరిగినట్టు లంచగొండితనం వంటి అవినీతి పనులన్నీ ఇవినీతి పనులన్న జాబితాలకి ఎగబాకిపోయాయి. నీతిని గొంగళీపురుగుల్లా తినేస్తున్నాయి. ఇంకాసిని రోజులుపోతే అవే సీతాకోకలై ఎగిరి విహరిస్తాయిసుమా. నో, ఫాదర్. నేను వెంటనే పాలిటిక్సులో దిగుతున్నాను. మై కంట్రీ నీడ్స్‌మీ - నాదేశం నన్ను పిలుస్తోంది.'

(ముళ్ళపూడి వెంకటరమణ - 'రాజకీయ భేతాళ పంచవింశతి' నుంచి)

* * *

'దేశసేవ, గీశసేవ అంటూ ఆ సన్నాసి ఏమేమో పేలుతూ వుంటాడనుకో! కాని, 'చెప్పేవాడికి సిగ్గులేకపోతే, వినేవాడికైనా వివేకం వుండొద్దూ'. పైగా, తనే బ్రహ్మాండనాయకుడైనట్టు ఊళ్ళో వాళ్ళందరికీ పేర్లు పెడుతూ వుంటాడు. సామెత చెబుతారు చూచావ్ - 'కురూపి ఏమి చేస్తున్నా డంటే, సురూపాలన్నీ లెక్కపెడుతున్నా' డన్నట్టు వాడికి మరొక పనేలేదు. ఎవరైనా రేపన్నరోజున్నదను కొనాలి. 'రూకలేని వాడు పోకచెయ్యడు' పోనీ మంచో చెడ్డో తన కోసం తను ఖర్చు పెట్టుకుంటున్నాడు

సరే! కాని వాడి కోసం కూడా మనవాడు ఖర్చు పెట్టడం దేనికి? అంతో ఇంతో ముట్టినంతవరకు వాడు బాగానే అంటకాగుతాడు. వెనకటికి 'ఎక్కడికి పోతావు విధవమ్మా అంటే వెంటనే వస్తాను పదవమ్మా' అనిందట.'

(నార్ల వెంకటేశ్వరరావు - శకునపక్షి (నాటిక) నుంచి).

* * *

'నేదు బాబూ! నన్నూ నాసంసారం అంతా అమ్మేసినా అంతఖరీదు గిట్టదు. అంచేత వందాయివ్వను, యాభైయీ యివ్వను. ఈ బాబుకేం? రెండోందలైనా 'ఇచ్చీఇచ్చీ' అంటాడు. నీకు నాను కాణీస్తే అందల సగం గుంజుతాడు. నా కన్నీ తెల్సు. ఈ సారాయాపారంలోకి దిగిన తరవాత బాబూ! నా కెన్నియిసయాలు తెలిసొచ్చినాయో సరీ సెప్పలేను. ఏ మనిసి మంచోడని ఒవురు జెప్పినా నాను నమ్మను. ఈ నోకంల డబ్బూ యాపారం తప్ప మరేట్నేదు. పసువులు - నోర్లేని సొమ్ములు - ఆటికి నీతుంది. కాని మనకి నేదు. సదువులేన్దాన్ని నాకూ నేదు; చదువుకున్నోడివి నీకూ నేదు. డబ్బుకోసం నోకం నోకంవంతా పడుచుకొంటోంది. డబ్బుకి నాను సారా అమ్ముతున్నాను. డబ్బుకి సదివిన సదువంతా నువ్వమ్ముతున్నావు. డబ్బుకి పోలీసువాళ్ళు నాయ్యాన్నమ్ముతున్నారు...'

(రా.వి.శాస్త్రి - 'ఆరుసారాకథలు' నుంచి)

* * *

'ఆ వరస బంగళాలు సిమెంటు కేకుల్లా వున్నాయి. వాటిముందు వయ్యారంగా వంగివున్న రోడ్డు - ఆ బంగళాలలో ఉండేవారి జోలికి దరిద్రం రాకుండా దేవుడు గీసిన గిరిలా ఉంది. దాని ముందున్న బీచ్ వెన్నెలకుప్పలా వుంది. సముద్రం మీద వెన్నెల వెండి ఆవిరిలా వుంది. ఆ యింటి గేటు పక్కనున్న గేరేజి కొత్త సబ్బు ముక్కలావుంది. ఆ బంగళా పోర్టికోలో ఆగివున్న మూడు కార్లు రెక్కలు ముడుచుకున్న ఇనుప పక్షుల్లా వున్నాయి. ఇంటిముందు పూల తోటలోని రెండు దారులు సన్నపిల్ల రెండు జడల్లా ఉన్నాయి. ఆ దారులు పక్కనున్న ఎర్ర కుండీలు పసిపాపల

మాత్రమున నిప్పుఁడాంధ్రమున మాటలాడ లేకుండునా? . ఆశ్చర్యము. అవిశ్వసనీయము. అసత్యము. ఆంధ్రమున నాతనిని మాట లాడకుండఁజేసినది అశక్తి కాదు - అనిష్టత, అసహ్యత'

(పానుగంటి లక్ష్మీనరసింహారావు - 'సాక్షి' నుంచి)

* * *

'నాన్నా, పత్రికల రంగుటద్దాల లోంచి, స్వార్థపు చత్వారపు కళ్ళతో దేశాన్ని చూస్తున్న నీకేం తెలుస్తుంది, టైము విలువ? నేను ఒక్క క్షణం ఆగలేను. దేశం గగ్గోలు గా ఉంది. లక్షలాది జనం బాధపడుతున్నారు. తిండితిప్పలయి పోయింది. మందు మాసి కాని కందుతోంది. ఇంపోర్టు పాలిసీ బాగులేదు. కారు అడిగిన రెండేళ్ళగ్గాని రాదు. పన్జేసే రేడియో బోల్డు ఖరీదు. బీదవాళ్ళు బీదబాధలూ గొప్పవాళ్ళు గొప్పబాధలూ పడుతున్నారు. దేశంలో కోడిగుడ్డు శాకాహారం స్థాయికీ, పూజ రోజు కాఫీ ఔషధం హోదాకీ పెరిగినట్టు లంచగొండితనం వంటి అవినీతి పనులన్నీ ఇవినీతి పనులన్న జాబితాలకి ఎగబాకిపోయాయి. నీతిని గొంగళీపురుగుల్లా తినేస్తున్నాయి. ఇంకాసిని రోజులుపోతే అవే సీతాకోకలై ఎగిరి విహరిస్తాయిసుమా. నో, ఫాదర్. నేను వెంటనే పాలిటిక్సులో దిగుతున్నాను. మై కంట్రీ నీడ్స్‌మీ - నాదేశం నన్ను పిలుస్తోంది.'

(ముళ్ళపూడి వెంకటరమణ - 'రాజకీయ భేతాళ పంచవింశతి' నుంచి)

* * *

'దేశసేవ, గీశసేవ అంటూ ఆ సన్నాసి ఏమేమో పేలుతూ వుంటాడనుకో! కాని, 'చెప్పేవాడికి సిగ్గులేకపోతే, వినేవాడికైనా వివేకం వుండొద్దూ'. పైగా, తనే బ్రహ్మాండనాయకుడైనట్టు ఊళ్ళో వాళ్ళందరికీ పేర్లు పెడుతూ వుంటాడు. సామెత చెబుతారు చూచావ్ - 'కురూపి ఏమి చేస్తున్నా డంటే, సురూపాలన్నీ లెక్కపెడుతున్నా' డన్నట్టు వాడికి మరొక పనేలేదు. ఎవరైనా రేపన్నరోజున్నదను కొనాలి. 'రూకలేని వాడు పోకచెయ్యడు' పోనీ మంచో చెడ్డో తన కోసం తను ఖర్చు పెట్టుకుంటున్నాడు

సరే! కాని వాడి కోసం కూడా మనవాడు ఖర్చు పెట్టడం [illegible] ఇంతో ముట్టినంతవరకు వాడు బాగానే అంటకాగుతాడు. వెనకటికి 'ఎక్కడికి పోతావు విధవమ్మా అంటే వెంటనే వస్తాను పదవమ్మా' అనిందట.'

(నార్ల వెంకటేశ్వరరావు - శకునపక్షి (నాటిక) నుంచి).

* * *

'నేదు బాబూ! నన్నూ నాసంసారం అంతా అమ్మేసినా అంతఖరీదు గిట్టదు. అంచేత వందాయివ్వను, యాభైయీ యివ్వను. ఈ బాబుకేం? రెండోందలైనా 'ఇచ్చీఇచ్చీ' అంటాడు. నీకు నాను కాణోస్తే అందల సగం గుంజుతాడు. నా కన్నీ తెల్సు. ఈ సారాయాపారంలోకి దిగిన తరవాత బాబూ! నా కెన్నియిసయాలు తెలిసొచ్చినాయో సరీ సెప్పలేను. ఏ మనిసి మంచోడని ఒవురు జెప్పినా నాను నమ్మను. ఈ నొకంల డబ్బూ యాపారం తప్ప మరేట్నేదు. పసువులు - నోర్లేని సొమ్ములు - ఆటికి నీతుంది. కాని మనకి నేదు. సదువులేన్వాన్ని నాకూ నేదు; చదువుకున్నోడివి నీకూ నేదు. డబ్బుకోసం నోకం నోకంవంతా పడుసుకొంటోంది. డబ్బుకి నాను సారా అమ్ముతున్నాను. డబ్బుకి సదివిన సదువంతా నువ్వమ్ముతున్నావు. డబ్బుకి పోలీసువాళ్ళు నాయ్యేన్నమ్ముతున్నారు...'

(రా.వి.శాస్త్రి - 'ఆరుసారాకథలు' నుంచి)

* * *

'ఆ వరస బంగళాలు సిమెంటు కేకుల్లా వున్నాయి. వాటిముందు వయ్యారంగా వంగివున్న రోడ్డు - ఆ బంగళాలలో ఉండేవారి జోలికి దరిద్రం రాకుండా దేవుడు గీసిన గిరిలా ఉంది. దాని ముందున్న బీచ్ వెన్నెలకుప్పలా వుంది. సముద్రం మీద వెన్నెల వెండి ఆవిరిలా వుంది. ఆ యింటి గేటు పక్కనున్న గేరేజి కొత్త సబ్బు ముక్కలావుంది. ఆ బంగళా పోర్టికోలో ఆగివున్న మూడు కార్లు రెక్కలు ముడుచుకున్న ఇనుప పక్షుల్లా వున్నాయి. ఇంటిముందు పూల తోటలోని రెండు దారులు సన్నపిల్ల రెండు జడల్లా ఎున్నాయి. ఆ దారులు పక్కనున్న ఎర్ర కుండీలు పసిపాపల

దోసిళ్ళలావున్నాయి.'

(బీనాదేవి - 'థేంక్స్ ఫర్‌ది పి.యమ్.' కథ నుంచి).

* * *

'ఆఁ ! ఏముంటది తియ్యింగ్రడి, అనుమాండ్ల గుడి కాడీనా అనుబవంతో సెప్పాలంటే ఈల్లకు పైసలు సంపాయించుడే కాదు, తమ మందిని కూడ గట్టుకునుడేకాదు, బంగ్లాలమీద బంగ్లాలు కట్టుడేకాదు, లంగతనాలతోని మోసాలతోని మందిని అరిగోస పుచ్చుకుంటరు గద. గందుకని మందికి ఈల్లందరి మీద గది బూడిద కింద నిప్పు తీర్గ బాగా కోపముంటది. ఈ పెద్దోల్లకు జరమందితోని మంచోల్ల మనిపించుకోవాల న్నది వుంటది. తమ మీది కోపమ్మీద నీల్లు సల్లాలని వుంటది. గందుకే అప్పుడప్పుడు గిసుంటి సబలు పెడుతరు. మనసుంటోల్లకు సాయం జేస్తమంటరు.

(జూకంటి జగన్నాథం - 'సహాయం' కథనుంచి).

* * *

'మీకందరికి తెల్సు. ఈ పర్దేసి రెడ్డేం పన్జేసినా పది మందీ సెబాసనేటట్టుగా సేస్తాడని. నాకు తెల్సు యిప్పుడు మీరంతా శానా ఆశ్చర్యపడ్తా వుండారని. ఇంకొక పక్క శానా యిశారపడిపోతుండారని! ఎందుకంటే ముత్తడు నా యింట్లో సేద్దిగాడు. మీ కండ్లకీ పాయికట్టులో ఈడొక మాలోడు అంతే! అంతకు మించేవీఁలేదు. అట్లాంటోణ్ని యీ పొద్దియేదిక మింద మంత్రిగారి పక్కన కుచోబెడ్తే అప్పటికీ పాయికట్లో నాయం బతికినట్టా? సచ్చినట్టా? ఇంక మేఁవంతా ఎట్లా మొకాలెత్తుకొని తిరుగులాడల్ల అని మీరంతా ఆలోసిస్తావుండచ్చు... నేనా? ఈ పొద్దో రేపో? ఎవుర్జూసినారు. నా తదనంతరం చీడు బాధ పడగుడ్దు. కాలూసెయ్యి వుడిగిన కాలాన సూసే దిక్కు లేక వాడు యాతన పడగుడ్దు. అందుకే వాడికి ఋణం తీర్చుకునే దానికి నాకు ఒక్కటి ఒక్క మార్గం తోసింది.'

(పులికంటి కృష్ణారెడి 'ముత్తడు గొప్పోడు కథనుంచి)

* * *

'కథకులందరూ 'కథక కంఠీరవ', 'గల్పికా పరమేశ్వర' కథానికాక శేషయ్యగారి ఆధ్వర్యాన ఆఫీసు వద్ద సభ జరిపి కవులనందర్నీ ఏకగ్రీవముగా తిట్టిరి. నవలయ్యగారు లేచి కవులను, వారితో కవిత్వాన్ని అరగంటసేపు మాటలతో తడబడకుండా కడిగిరి. మొదటి పదిమంది మెంబర్లూ వారి కథల్ను చదివి వినిపించిరి. మిగిల్న పదిమంది టైములేక తమ కవితల శీర్షికలు చదివి ప్రజల నానందరసభరితుల కావించిరి. తదుపరి అధ్యక్షులు స్తోత్రయ్యగారు ఆ రచనలను పొగిడి వాటిని ముద్రించిన సంపాదకుల్నీ, శ్రద్ధగా చదివి అర్థం చేసుకోలేకపోయిన చదువరుల్నీ దీర్ఘంగా మెచ్చుకొనిరి. కార్యదర్శిగారు వారు నివేదికను ఒక కథానికా రూపంగా రచియించి సభకు అందించిరి. సభానంతరం ప్రముఖులు కాఫీహోటల్ ప్రవేశించిరి.'

(మాచిరాజు దేవీ ప్రసాద్ - 'తెలుగు పేరడీలు' నుంచి).

* * *

'ఈసంవత్సరములో మన ప్రధానమంత్రి వరేణ్యులైన దేవాగౌడలుంగారికి పదవీ వియోగం సంభవించే సూచనలు స్ఫటికమువలె స్పష్టముగా కనిపించుచున్నవి. నవ్విపోరురు గాక నాకేటి సిగ్గు, నా గురకయే కాక నాకేటి వెరపు అనుకొంటూ సభలూ సమావేశాల్లో పది పదిహేను నిముషాలు నిదురించే ప్రధాని గారికి ఇక యధేచ్ఛగా పవళించుటకు అవకాశము లభించును. ... దేశ భవిష్యత్తు ఉగాది పచ్చడివలె ఉన్నది. ఈ సంవత్సరంలో ఆకలిచావులు, ఆత్మహత్యలుండవు. ఏరులై పారే బీరుతో రైతులు పంటలు పండించి పిల్లా పాపలతో సుఖ సంతోషాలతో ఉందురు. రాష్ట్రప్రజలందరు శ్రమదానం చేయుటకు ముందుకు వత్తురు. ఈశ్వరనామ సంవత్సరంలో ప్రభుత్వ ఆదాయం రెట్టింపగును. మందువల్లే ఈ ఆదాయము వచ్చును. ...నాయకులందరూ వేదాంతమును ఒంట బట్టించుకొని మందోపాసన చేయుచూ ప్రజలను మందు భాగ్యులను చేయవలెనని ముఖ్యమంత్రిగారు సెలవిచ్చెదరు.'

(తెలిదేవర భానుమూర్తి 'నూతన పంచాంగం -'వార్త'నుంచి).

* * *

'మగాడు ఆఫీసు నుంచో, అడివిలోంచో, పొలంనుంచో, ఫేక్టరీ నుంచో ఎక్కడినుంచో చెమటతో వచ్చినా అది అంతటితో సరి! కొంప చేరగానే అయ్యగారికి బాత్‌రూమ్‌లో బకెట్‌తోవాటరో, దడివార కడివెడు ఉడుకునీళ్ళో సమకూర్చి, ముట్టుకోనిస్తే వీపురుద్ది తక్షణం ఆ చెమట వదల కొట్టాల్సిన బాధ్యత ఆడదానిదే... ఇంతకీ ఈ ఆడవాళ్ళకి మాత్రం ఆఫీసునుంచి వచ్చినా అడవిలోంచి వచ్చినా, అదీ ఇదీ కూడా లేక రోజంతా కొంపలోనే పడివుండి వంటపనీ, బట్టలుతికే పనీ, చచ్చారి పనీ, పాచిపనీ, పాలిష్‌పనీ వగైరాల్నీ చేస్తూ పొయ్యిలో దుంపలా మగ్గిపోయినా ఆ చెమటకి విలువ వుండదు. ఆడదీ స్నానం చెయ్యాలి. కానీ ఆ స్నానం తన చెమట తాను భరించలేక కాదు - పడగ్గది కంపు పులుముకోవడం కోసం మొగుడి దుర్గంధాన్ని మోయడం కోసం ...'

(సావిత్రి - 'స్త్రీలకోసం అంటే' వ్యాసం నుంచి).

* * *

**"తెలుగు మాటలనంగ వలదు**

**వేదముల కొలదియ కాజాడుడు"**

**(పాల్కురికి సోమన, 12వ శతాబ్ది)**



## అనుబంధం

ఈ పుస్తకం రాయడానికి, అక్కడక్కడ ఉదాహరణలు ఇవ్వడానికి బాగా తోడ్పడిన ఈ కింది పుస్తకాలను చదివితే మన తెలుగు గురించి ఇంకా బాగా తెలుసుకోవచ్చు -

1. ఆంధ్ర వచన వాఙ్మయము. - నిడదవోలు వెంకటరావు.
2. తెలుగులో కొత్త వెలుగులు - తూమాటి దొణప్ప.
3. ఆంధ్రభాషా వికాసము - గంటి జోగిసోమయాజి
4. భాషలో తమాషాలు - ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి
5. వాడుక తెలుగులోఅపప్రయోగాలు - రవ్వా శ్రీహరి
6. తెలుగు భాషా చరిత్ర - స్ఫూర్తిశ్రీ
7. భాషాశాస్త్రం - పి.ఎస్.సుబ్రహ్మణ్యం
8. తెలుగు వాక్యం - చేకూరి రామారావు
9. జాతీయములు - సామెతలకథలు- ముసునూరి వేంకటశాస్త్రి
10. తెలుగులో లేఖా సాహిత్యం - తెలుగు అకాడమీ ప్రచురణ
11. తెలుగు పదబంధ కోశం - " " "
12. సాహిత్య భాషగా తెలుగు - ఖండవల్లి లక్ష్మీరంజనం.
13. నుడి - నానుడి - తిరుమల రామచంద్ర
14. ఆంధ్ర ప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం, హైదరాబాద్ ప్రచురించిన తెలుగు వాచకాలు.

* * *

పూర్తి పేరు : ద్వాదశి నాగేశ్వర శాస్త్రి

పుట్టిన పూరు : లింగాల, కృష్ణాజిల్లా

అమ్మానాన్నలు : లక్ష్మీ ప్రసన్న, కృష్ణ శాస్త్రి

చదువు :

బి. ఎస్సీ. (సర్ సి. ఆర్. రెడ్డి కళాశాల, ఏలూరు.)

ఎమ్.ఏ. తెలుగు. ప్రథమ శ్రేణి. -

ఆంధ్ర విశ్వవిద్యాలయం.

ఎమ్.ఫిల్. 'ఏ' గ్రేడ్, నాగార్జున విశ్వవిద్యాలయం.

పిహెచ్.డి. 'గోల్డ్ మెడల్'. -

తెలుగు విశ్వవిద్యాలయం.

పి. జి. డిప్లొమా ఇన్ లింగ్విస్టిక్స్, -

ఉస్మానియా విశ్వవిద్యాలయం.



ఉద్యోగం : 1972 నుంచి ఎస్.కె.బి.ఆర్. కళాశాలలో - ప్రస్తుతం తెలుగు శాఖలో రీడర్.

ప్రచురించినవి :

1. సమాధిలో స్వగతాలు (వచనకవితా సంపుటి - మార్గశీర్షతో కలసి) - 1981
2. వాఙ్మయ లహరి (వ్యాస సంపుటి) - 1982
3. సాహిత్య సౌహిత్యం (వ్యాస సంపుటి) - 1985
4. మారేపల్లి రామచంద్రశాస్త్రి కవితా సమీక్ష (ఎం.ఫిల్. సిద్ధాంత వ్యాసం) - 1987
5. ద్రావిడ సాహిత్య సేతువు ఆచార్య చల్లా - 1989
6. వ్యాస ద్వాదశి (వ్యాస సంపుటి) - 1991
7. అక్షర చిత్రాలు (అరుదైన ఛాయాచిత్రాల సంపుటి) - 1993
8. సాహిత్య సంస్థలు (పిహెచ్.డి. సిద్ధాంత వ్యాసం) - 1995
9. ఆంధ్ర సాహిత్యము (మూడువేల బిట్లు గల క్విజ్ పుస్తకం) - 1997

గురువులు : ఆచార్య తూమాటి దోణప్ప, ఆచార్య చేకూరి రామారావు, ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావు, శ్రీ బండ్లమూడి సత్యనారాయణ

ఇతర అంశాలు :

1. యు.జి.సి. వారి నేషనల్ విజిటింగ్ ఎసోసియేట్ ఫెలోషిప్ పొందటం
2. జిల్లా అధికార భాషా సంఘ సభ్యత్వం
3. కేంద్ర సాహిత్య అకాడమీ వారి సాహిత్య విజ్ఞాన సర్వస్వంలో తెలుగుసాహిత్యంపై పదిహేడు వ్యాసాలు రాయటం.
4. పాఠ్య రచయిత, స్కూల్ ఆఫ్ కరస్పాండెన్స్, ఆంధ్ర విశ్వవిద్యాలయం.